షేక్స్పియరు రూపక సంతాన కథా సారావళి.

అనాఘ్రాతంపుష్పము.

TALES FROM SHAKESPEARE.

# హ్యాంలెట్ — డెన్మార్కు కుమారరాజా

# HAMLET—PRINCE OF DENMARK.

హేవాహేమీః

---


గోగులపాటి వీరేశలింగముపంతులు

ఆంగ్లసామ్రాజ్య, స్థిరీకరణశాఖ, ముద్రికాధికారివారిచే


నాంధ్రమున రచితము

కాకినాడ.

By


GOGULAPATI VIRESALINGAM PANTULU B. A.

*JOINT SUB-REGISTRAR*, COCANADA.



మొదటికూర్పు.

1st Edition.




వెల 6 అణాలు.

Price 6 Annas

# కృతి సమర్పణము.

జగదేకనిధి, జగదేకఖని, షేక్స్పియరు కవిరాజకంఠీరవుడు, వ్రాసిన నాటకరాజము "హేమ్లెటు"ను, కథాసరణిగ, నే రచించిన దీనిని, సువ్యాఖ్యలూరుచు విని, ముద్రణ కెదురు చూచుచుండి, గత అక్షయ సం॥ జ్యేష్ఠశుద్ధ విదియా స్థిరవారమున, నిండువయసున నవతారము చాలించిన నాగృహిణికి, సహధర్మచారిణికి, అనుసరణికి, మనోరమణికి, మనోహారిణికి, నాయికానారి, నారీమణి, సుందరమ్మకీ రత్నకిరీటికి గద్యకృతినిఁ గలకాలమామె పేరు ఈలోకమున నిలుపఁగోరికతోడ నంకితముచేయుచున్నాఁడను.

అసహుఁడనయిన
ఆమె భర్త
గతభాగ్యుఁడనగు
**నేను.**

# ఈ నాటకకథయందువచ్చు పాత్రములు

Claudius—క్లాడియస్—డెన్మార్కు దేశపు రాజు.

Hamlet—హ్యాంలెట్—వెనుకటి రాజుగారి కొడుకు—ఇప్పటి రాజుగారికి వరుసకు వారికిం గూడ కొడుకు

Horatio—హొరేషియో—హ్యాంలెట్‌కు స్నేహితుడు.

Polonius—పొలోనియస్—రాజబంధువు.

Laertes—లెర్టిస్—పొలోనియస్ కొడుకు.

Rosencrantz—రోజన్‌క్రాంజ్ | రాజసభికులు.

Guildenstern—గిల్డెన్‌స్టెర్న్ | దర్బారుభటులు.

A Priest—పురోహితుడు.

A Captain—ఓడనాయికుడు.

Ghost of Hamlet's Father—హ్యాంలెట్ తండ్రి భూతము.

Fortinbras—ఫార్టిన్‌బ్రస్—నార్వే దేశపు రాజు.

Players—ఆటవాండ్రు.

Gertrude—గెర్‌ట్రూడ్—డెన్మార్కు దేశపు రాణి. హ్యాంలెట్ తల్లి.

Ophelia—ఒఫీలియా—పొలోనియస్ కుమార్తె.

రంగస్థలము:—ఎల్సినోర్ (Elsinore).

# భూమిక.

"కవివరులకు మేకిని నెవ్వారుసాటి మించినగరిమన్"

ప్రపంచప్రపంచముల వారును, ప్రాఁతప్రపంచము వారును, క్రొత్తప్రపంచము వారును, ఖండఖండాంతరముల వారును, దేశదేశాంతరముల వారును, జాతిజాత్యంతరముల వారును, వేయేల? జిహ్వాకోకరుచియు, బుద్ధికొకబుద్ధియుఁగల యెల్లవారును, యెల్లయెల్లల వారును, షేక్స్పియరు (**Shakespeare**) కు బ్రహ్మరథమును బట్టియున్నారు. అగ్రతాంబూలము నిచ్చియున్నారు. గడచిన మూఁడునాల్గు శతాబ్దములనుంచి, విమర్శకులు, వ్యాఖ్యాతలు, గుణగ్రహణపారీణులు, ఒరసినారు. వన్నెఁ గనిపెట్టినారు. ఎత్తరసినారు. అయినను, మా మొగము మేమేమి యొరసితిమి నిన్ను? నీవన్నెను మేమేమికనిపెట్టితిమి ? నీయెత్తేమి యరసితిమి? మేమెల్లరమును పెద్దలమనుకొనువారమే ? పెద్దలమనిపించుకొను వారలమే ? సర్వవిధముల నెరసితిమిగాని, నిన్నుఁబూర్తముగ నెఱుఁగనేర్తుమే ? మావశమే ? వాఙ్మయ సర్వంసహాధీశ్వరా? యనువారే. ఆంగ్లకాళిదాసా, వాణీదాసా, భారతీదాసా యనువారే ? ఈయందఱును మన మల్లినాథసూరికి సరిసమానచేతులే ? నిండుతులఁదూఁగినచేతులే ? జగన్నాథపండితునకుజ్జీలగు వారే ? తర్జన భర్జనములఁ గావించినవారలే. నిగ్గు తీసినవారలే, నిగ్గుగ్రహించినవారలే.నిగ్గుగోరిలినవారలే ?

షేక్స్పియరుపుట్టుక 1564 సంవత్సరము. లయము 1616 సంవత్సరము. రచనలు 1590 మొదలు 1613 వఱకు. రూపకసంతానము ముప్పదియాఱు వెలువడినవి. సంతానరాముఁడయినాఁడు. తనసంతానముచే,లోకములను 'రమ +

సకలవిద్యాకళాచణుఁడు, భూరికళాకలాపుఁడు. వచోనిపుణత్వమునందు, సత్కథా రచనలయందు, నీతివిధురత్వమునందు, నెందుసరిగానము వీనికి, సరిగానము లేదు. సరితాళము లేదు. సంగతి, అసలేలేదు. సరిగము యనఁగనే రాగముదిగునా ? రసమెక్కునా ? అంగములు సామగానలోలురే ? తాళము వేయువారే ? సంగతులు గ్రహించితిమనువారే ? సులక్షణ సారము చేతఁబట్టికొని గణములులెక్కించి, యతిప్రాసములకు బ్రాకులాడి ఛందోనిబద్ధులయి పద్యములల్లి, కవులమనుకొను వారే ? ధార వచ్చునా ? రసగంగ దిగునా ? ఆ మహేశ్వరుని తలనుండి దిగునా ? నసిగులఁజూచుకొనక. వానిచతురతావిశేషములు, యెవరికివారే చదువునప్పుడు వినవలయును. చదువు కొలఁదియును నూతనోత్సాహంబగుచుఁ గానుకఁబొనస్పును. ఒకపరి చదివిన నీహ్యాంలెటునాటకమును దిరిగితిరిగి చదువక యుండుటకుఁ జదువరులకు వశమే ? అట్టి యీమహానాటకముసు గథాసరళిగ వ్రాసినాఁడను. రూపక తాళము తాళమానముగ, రసవత్తరములగు ఘట్టములలోని మేలుకూర్పులు, సారపుఁబలుకులు, వాక్యార్థములు, అర్థాంతరములు, వక్రోక్తులు, యేమేమి భావగభీరత లెక్కడెక్కడ, నిబిడీకృతమైయుండినవో, వాటినన్నిఁటిని, సాధ్యమైనంతవఱకు, నే గ్రహించినంతవఱకుఁ "దేనెసోఁకనోరు తీయనగురీతిని, దొడనర్థమెల్లఁ దోఁచునట్లు" గుదిగుచ్చితిని; క్రోడీకరించితిని; మేలేర్చితిని; సారము తీసితిని. అంటుకట్టితిని. షేక్స్పియరువాడిన పేరులను, స్థలవిశేషములను, యితివృత్తముల నిసుమంతయుమార్చక యుంచినాను. శతాబ్దములతరబడి

చెక్కుచెదరకయున్న, సేరుఁవి, సార్థకములయినవి, సాభిప్రాయములయినవి. పుట్టిపరసము నంటఁబట్టించునవి.

షేక్స్పియరు పేరు నాకు బదియవయేట ననఁగా, 1891 సంవత్సరమున నా చెవినిఁబడినది. నా పాలకపితలగు శ్రీ రావు బహదూరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు, రచించుచువచ్చిన నాటకకథలను వినుచువచ్చితిని. అప్పటికింకను జదువుత్రాణ నాకుఁ గలుగలేదు. ఒక్కొక్కతరిని, వారే, మేమందఱమును భోజనములు చేయునప్పుడు, నాయాసమయములవ్రాయు కథలను జెప్పుచు, సంతోషముపట్టఁజాలక, ఆఘనునిమహిమను, ప్రతిభను, మేధావంతమును వేనవేల భంగులఁ గొనియాడుచుండెడివారు. గయ్యాళినిసాదుచేయుట (The Taming of the Shrew) వారుచెప్పినకథ యిప్పటికిని మఱపునకురాదు. ఆగయ్యాళిగౌరీదేవి కథ చెప్పెడి యాయనకంత నవ్వులేదు. వినుచుమేముమాత్రము కడుపులుబ్బిపోయితిమి. క్రమశః సరస్వతీప్రసన్నుఁడనగుచు 1893 సంవత్సరమునుంచి, పాఠశాలలో, జదువుకోరి, షేక్స్పియరు రత్నములోకకొన్ని పఠనీయములగుచు వచ్చినవి. ఇట్లాఱువర్షములు విడిరత్నములతోఁ మిడిమిడిజ్ఞానముతోఁ గాలముజరగినది. 1898 సం॥రము మొదలు 1903 వఱకును, చెన్నపురి క్రైస్తవకళాశాల, నాచదువులకుఁ బట్టుకొమ్మయయినది. పుట్టినిల్లుయయినది. ఇంట సరేసరి, శ్రీవీరేశలింగముపంతులుగారి యింటను, ఆంధ్ర గీర్వాణ, నవగీర్వాణవాఙ్మయములకు, వసతిగృహము కాదు. స్వగృహమే యయియున్నది. సంకల్పము 'స్వగృహే' యనిచెప్పుకొనవచ్చును గదా. సరస్వతి యం

టిన నంటుగాక, అంటకపోవు గాక. ఎంతయుంటిన నంతియు యంటుగాక! నీటికొలఁదియును, తామరగదా.

ఆకాలమున, షేక్స్పియరు, అధ్యయనమునకుఁ బెట్టినదిపేరు, పుట్టిపుట్టినపేరు, చెన్నపురిరాజధాని కంతకును, నాకేయాచార్యుఁడు, గురూత్తముఁడు, ఆచార్యులకాచార్యుఁడు, ఆచార్యపీఠము, శాస్త్రవేత్త, బ్రహ్మవేత్త విలియం మిల్లరు (Rev: William Miller M A; L. L. D; D D; C. I. E.) ఆమహామహోపాధ్యాయులయొద్ద పాదాక్రాంతుఁడనయి రెండు నాటకములమాత్రము నేర్చుట నాభాగ్యవిశేషము. ఈహ్యాంలెటునాటకము నాకుఁ బఠనీయగ్రంథముగ నలిగినది గాదు. కళాశాలనుఁగొట్టిన పిండిగాదు. మొదటితడవ 1899 సం॥న నాచేతఁబడినది. గట్టిపట్టుగఁ బట్టువడినది. అభిమానమెక్కుడైనది. నాపాలకపితలగు శ్రీ పంతులుగారి నాటకకథను దాఁకకపోవుట మనభాషకొక గొప్పలోపముగ నెంచితిని. ఆహా, ‘ఆ గద్యతిక్కన’ కలముపట్టిన, నీనాటకకథారాజమున కెంతటిమెఱుగు వచ్చెడిదియో! హ్యాంలెటు, వెఱ్ఱి, యెన్ని వెఱ్ఱితలలు వేసెడిదయో! లెక్కయిడరాని సారులీ నాటకమును నేనతియుత్కంఠతోఁ జదువుటగాంచుచు, నాజాయయు (మైసూరు నివాసులగు మ. రా. రా. శ్రీ. చెఱుకుపల్లి యల్లాప్రగడ వేంకటరత్నము పంతులుగారి జ్యేష్ఠకుమారిత) నాకుమార్తె (చి॥ సౌ॥ లక్ష్మీనరసమ్మ లలితాంబలు) లిరువురును నన్నుఁదిలకించి, చోద్యమందుటఁ గని వారికిఁ జవిచూపుటకీ కథను వ్రాసితిని. ముద్రణకుఁబూర్వమే నాయర్ధాంగి గతించినది. ముద్రణయయినఁగాని, నాకునిద్ర పట్టలేదు. వేగిర

ము వలనను, నేను లౌకికాధ్వర్యుఁడ నగుటవలనను, అక్కడ క్కడ కనుపట్టు తప్పులనెఱసుల నింకొకకూర్పున సవరణగావించెదను. పాఠకులు, పాఠకమహాశయులు నన్ను మన్నింతురుగాక! అతియుక్కుఱతో నాకుఁదెలియపఱతురుగాక.

ఈబ్రిహ్మాండగ్రంథమును నవగీర్వాణమునుండి తెలిగించితిని—నానేర్చినకొలఁదిని. ఈగద్యకావ్యమునకు మహాప్రసిద్ధి కలుగునుగాక ! లక్ష్మీశ్వరుండిచ్చుఁగాక ! లోకనుతుఁడు నరనుతుఁడు, నృపపుంగవులు, రాణియెలిజబెత్, రాజుజేమ్సులచే వినుతుఁడు, షేక్స్పియరు నైపుణీమహిమ, వాచాలత్వము, పాత్రవిలసనము, అపాత్రనిరసనము, మనుజస్వభావనైజగుణ నిర్ధారణ ప్రచారములు, లోకజ్ఞత, వాఙ్మయధురంధరత్వము, కళావిశదత్వము, ధర్మమార్గక్రియాదర్శకత్వము లోనగునవియన్నియు, నాంధ్రమాతకు, భారతికి మాయమ్మకు నూతనతొడవులుగ నమరునుగాక !

"మందఃకవియశఃప్రార్థీ" షేక్స్పియరుమహాకవియశఃప్రార్థి; భారతీమాత, తనతల్లిశలవు ప్రస్తుతము గైకొనుచున్నాఁడు. బుధారాధనవిరాజి, షేక్స్పియరుకు దాసానుదాసుఁడు, తన లలాటలేఖ, ఆయుర్భాగ్యలేఖ, కొంతకాలమీతనువున నిలచునేని, భాషాయోష వ్రాయించుకొలఁదియును, తక్కుంగల యట్టి నాటకకథలను వ్రాయసంకల్పించుకొనినవాఁడు.

గోగులపాటి వీరేశలింగ . పంతులు, బి. ఏ.

కాకినాడ. | [జాయంటు సబురిజస్ట్రారు.[
ది 11-8-26 |

# HAMLET.

## PRINCE OF DENMARK.

# హ్యాంలెట్.

డెన్మార్కు కుమారరాజు, హేమాహేమీ.

---

## భూతసందర్శనకాండము.

---

డెన్మార్కుదేశము గొప్పరాష్ట్రము, అనివన్నెగాంచిన దినముల మెప్పునొందినమంచిరాజు జనపాలనశీలుఁడు, దొడ్డరాజు హ్యాంలెట్ (Hamlet) అని పేరుమ్రోగినవారుండిరి. వర్షవర్షము సమీపరాజులనుండి కప్పములను మిగులదర్పముతోడుత స్వీకరింపుచుండుట మాత్రముగాక, ఇంగ్లండువంటి సామంతరాజ్యముమీఁదఁగూడ పైఁజెయ్యివైచి కప్పముగొనుచుచుండెను. చివ్వకుఁగాలుద్రివ్వి నార్వేదేశపురాజు మేటివాఁడు ఫార్టిన్‌బ్రాస్ (Fortinbras) సాగరాలదొంగను పాతాళము నకడఁగద్రొక్కెను. తిరిగి తలయెత్తనేలేకపోయెను. తుదకుఁ దనప్రాణమును గోలుపోవుటయేకాక అంతకుఁబూర్వము డెన్మార్కునుండి బలవంతముగలాఁగికొనిన భూములనుగూడ నష్టమునొందెను.

హ్యాంలెట్ పరిపాలనమున డెన్మార్కుప్రజలు మిక్కిలి సౌఖ్యముగనుండి సిరిసంపదలతోడఁ దులతూఁగుచుండిరి. వేయేల ? ఒకరామరాజ్యమే. లెక్కకు రెండవరామరాజ్యమే.

అనిమనము ఖండఖండాంతరముల కానలనున్న మనము వా కొనవచ్చును. ఎల్సినోరు (Elsinore) న యున్న రాచనగరిని, అనుకునియున్న పువ్వులతోఁట ఫలములతోఁట యుద్యానవనమున నొకనాఁడు హ్యాంలెటుమహారాజు కాలధర్మము నొందిపడియుండెనన్న వార్తనువిని పౌరులెల్లరును నాబాలగోపాలము కడువిషాదముజెందిరి.

ప్రతిమధ్యాహ్నమునను, ఆయన యారమ్యస్థలమునఁ జేరుకొని యొక్కింతతడవు చెట్టుచేమలనీడను,పుష్పగుచ్ఛముల లతాజొంపములపొంతను వెన్నవాలిల్చుట, విశ్రాంతిఁజెందుట వాడుకయయినది. ఇచ్చట పరుండియుండినప్పుడు రాజుగారినొక విషసర్పము కఱచినదని వారిసోదరుఁడు బైటకుఁ జెప్పెను. నేలమీఁదను జచ్చిపడియుండెననియును, తాను జూచితిననియును జెప్పెను. గెర్ట్రూడ్ (Gertrude) రాణిగారికి వర్తమానముపంపెను. గతించిన తనభర్తగారి కళేబరమునుజూచి యామె దుఃఖసాగరమున మునిఁగినదయేమోయనిపించినది.

రాజుగారికి నొక్కఁడేకుమారుఁడు, కుమారతిలకము; ఆయనపేరుకూడ హ్యాంలెట్. పితృనామముదాల్చెను. తన తండ్రిగారియెడ నత్యంతప్రేమయును, ప్రేమనుమించుగౌరవమును గలిగియుండెను. "చిన్నారిపొన్నారిచిఱుతకూకటినాళ్లు" గడచినాఁడు. "నూనూగుమీసాల నూత్నయౌవనమున" మురియువలయునీడు. అత్యుదారగుణస్వభావుఁడు. ఒహుయాలోచనపరుఁడు. అసిధారావ్రతశీలుఁడు. అమితసాహసి. అయినను, కడుపునసుండు సీళ్లుకదలకుండఁగ నింటపట్టుననుండి,

విద్యాగోష్ఠితోడుత కాలమును సద్వినియోగమునకుఁ దెచ్చు టకాయనకు వినోదక్రీడయయియుండినది. యుద్ధకార్యములకు రాజతంత్రము తెచ్చిపెట్టు, చుట్టబెట్టు, తగవుగిగవులకాయన విముఖుఁడు; పెడమొగము పెట్టుకొనును. శ్రీయుతుఁడయ్యును మదింపఁడు. అట్టి యీపిన్నవానికి రాచకూనకుఁ, దనతండ్రి యాకస్మికమృమరణము పైనవ్రేలాడుచున్న తనమీఁది దొర్లి పడినట్టు, అధికతరముగు పరితాపము గలిగించినది. ఇట్టితరుణ మున తనజనని తగనివిపరీతపుచర్య తనమదికలఁకను మఱింత యెక్కువచేసెను.

గెర్ట్రూడ్ రాణి ప్రప్రథమమున తనకొడుకునకుఁ బితృవియోగముతోఁ బాటు తనకును భర్తృవియోగ జనితదుఃఖము కలిగినపిమ్మట కించపకుటమాని, మానుటమాత్రమేగాక కీర్తి శేషుండగు తనభర్తగారిసోదరుని సహవాసమువలన నుపశాంతివహించినట్టు కనుపించినది. ఈక్లాడియసు సర్వవిషయముల నతనియగ్రజునకు యెదురువేదము—కుటిలుఁడు, వక్రస్వభావుఁడు. ఈలక్షణములకుఁదగిన ముఖారవిందము. మాటల తేనె యుట్టిపడుచు, ముఖమంతయును నోరుచేసికొను నీతని స్వభావము మనచిన్న హ్యాంలెటుకు స్వతహాగానేనగింపుగ నుండుచువచ్చెను. తనభర్తగారుగతించి రెండుమాసములు కూడ నింకనుబూర్తికాలేదు. నిండలేదు. నిండుకొనలేదు. ఉన్నట్టుగనుండి, యొకదినము గెర్ట్రూడ్ రాజ్ఞికిని, మఱిది క్లాడియసునకును గళ్యాణముహూర్తము, లగ్నముతోసికొని వచ్చినది. మోహపుంబట్టపుదేవియయినది. కళ్యాణమహోత్సవమును ఆయనగారి డెన్మార్కురాజాగిరియును రాజ్యమంత

యును బొక్కినది. హ్యాంలెటుకు యీనుతా గ్రహావిసోఁకిన
తోడనే తనవంటికి బాణములవలెను, శూలములవలెను, దగిలి
నాఁటినమనస్సునకు హడలుయును, విస్మయమును గలిగించినవి.
నిజముపలుకుచో, నిజముపరికించినచో, యీసామ్రాజ్యమునకు
హ్యాంలెటుయే సరియైననాథుఁడు; భూజాని. అయినను తన
పినతండ్రి తనమాఁటతీపిచేఁ బ్రజలను దనజేబునవైచుకొని తన
కుటిలయత్నములను కౌటిల్యశాస్త్రవిధానముననే, మాయా
విధానముననే, వారియెన్నికమీఁదనే, వారిచేతనే పేరుపెట్టి,
బొట్టుపెట్టి పిలిపించుకొని పట్టముగట్టుకొని ఫలోన్ముఖమున
కుఁ దెచ్చుకొనెను. లోకులైనను యింతటిదుండగమునకు,
యింతటిపిల్లగనమునఁ జెవియొగ్గి, ఆయెన్నికకు తనయెన్నిక
కుఁ దమతలల నెగరవైచియుండరుగాని తనయనంతరము
హ్యాంలెటునేమూర్ధాభిషిక్తునిఁ దప్పకగావింతుననుపలుకు క్లాడి
యసు మాయావాగురమున వారినిఁ జిక్కించినది. జరిగినది
యేమో, యేలొకో జరగినను డెన్మార్కుప్రజలకు మాత్రము
హ్యాంలెటు అల్లారుముద్దులబిడ్డఁడు. ముమ్మాటికిని, అల్లారు
ముద్దులబిడ్డఁడుయేను. మీఁసపుఁగోడి నూనూఁగుగనుండిన
నుండుగాక. గడ్డముమీఁదినూగారు తొటిపువ్వారపు మిన
మిసలాడిన నాడుగాక. ఇట్టివిడ్డూర్యమున కెటులనొప్పుకొనిరో
యూహించుటకు, అవగాహనముకాలేదు. రాణియొక్క ద్వితీ
యవివాహముకూడ, అంతటిసమస్యయే. దీనిభావమేమి తిరు
మలేశా! వెనుకటిరాజునకు భయభక్తులు, భక్తివిశ్వాసములు
విశ్వాసౌదార్యములుగలిగి యుండినయామె— యీ, యీరెం
డవనిత్యకళ్యాణము పచ్చుతోరణము, పచ్చితోరణము, అపు

రూపమ్మసువాసిని యగుటనుగని ముక్కున వ్రేలుపెట్టుకొనని వారులేరు. ఈజడ్డుబుద్ధి, యేలోకంబుననైనం జెప్పంబడునే యనువారే? నరపతులు మేరందప్పిన మరణాంతకమానుగాని మానదు. అని సుమతులు గ్రహించియేయున్నారు.

"క॥ భూమికి ధనధాన్యములకు
భామలకును మానములకుఁ బ్రాభవములకుం
గామించి మీఁదుగానక
శ్రీమదమున మానధనులఁ జెనకుదురొరులన్."

ఈవిషయములను కుమారరాజా తరిచితరిచిచూచినను చిలికిచిలికిచూచినను, తనమనస్సంతయును హాలాహలప్రాయమయినది—సంతోషము చచ్చుపడినది. ఉల్లాసము నట్టుపడినది. ఉత్సాహము నీరైనది. కించసహాస్రి తలలనెక్కినది. ధుమధుమ మొగముమీఁదఁ దాండవము.

"తే॥ చిత్తమొకటియుంగఁ జెక్కిటం జెయ్యిసేర్చి
కౌతుకంబేది పడసాలాగ్రమున నేల
వ్రాసి పెంపుచు మోమరవాంచి వగలఁ
బొందె మన్నాంబునందన పువ్వుబోలె."

తండ్రిచావువలనఁ గలిగిన మనోవైక్లబ్యము పొంగును దగ్గించుటకు, క్లాడియసు యెన్నియో పడరానిపాట్లు పడెను. హ్యాంలెటును దనసరసకుఁ జేరంజీరి, కమ్మనిపలుకులు పలికెను. కాని యేమిసార్థకము? కన్నయమ్మకూడ కన్నస్వాతంత్ర్యము తోడను చనవుతోడను విచారసాగరమున కంచువలెనుండు నలుపుఁదీవలబారును విసర్జింపవలయుననియును వివాహసమ్మోశనమునఁ దానును మమేకము కావలయుననియును బహు

బోధచేసినది. నూరిపోసినది. ప్రయోజన మేలయుండును ? వీటికన్నిఁటికిని హ్యాంలెటు గద్దదిక. పెదవివిఱుపు. మొగము చిట్లింపు. తల్లీ! మంచితల్లివి నీవు నాకు దొరికితివి. మసిరంగు అంగీ, అంగరకా, పోనీ, కాలక్రమాగతములగు నలుపుదుస్తుల ధారణము, నాకడుపులో దుఃఖమును, మంటయును యున్నదియున్నట్టు తెలుపుటకు వాటిశక్తి చాలియున్నదనుకొంటివా ? బయటిభేషజములను మించునట్టి, మించునట్టివస్తువు యీ నాయుస్థిపంజరము లోపల దాఁగియున్నది. ఈబాహ్యచిహ్నములన్నియును కొసరులు, అసలులులేని కొసరులుతల్లీ!

తల్లికి నేమన మొగముచెల్లును ? మిన్నకుండుటయే పరమావధి. గతించిన తనభర్తగారి సమాధిమీఁద మొలచు గడ్డి పసరికరంగు తాల్చకమునుపే, క్లాడియసుతోడి తనకు జరగిన వివాహమాంగళ్యము కట్టెకుటను గాన్పించినపుడు, తనబాష్పకణములు విషాదసూచకపుదుస్తులు శోకకపటనాట్యము, నటన, భరతశాస్త్రోపలంబనమువలె కనుపింపక తప్పదని యామెకును దెలిసియేయున్నది. క్లాడియసు (Claudius) మాత్రము తనచక్కని యుక్తులతోడను, హేతువాదముతోడను సిద్ధసంకల్పుఁడయి యుండును. సిద్ధసంకల్పుఁడాయెనా యనుమాటమాత్రము మీమాంసము. హ్యాంలెటు ముద్దుపట్టీ ! నీనిజజనకునకు నీవు చూపుచున్న యీయుర్వవిషాదకృత్యము, నీసత్స్వభావమును, ఆయనయెడ నీకుఁగల యాపేక్షయును, అద్దిరయ్యా! చెప్పకచెప్పుచున్నవి. అయినను నీకు నేను చెప్పవలయునా ? మీనాయన తన జనకునిఁ గోల్పోయియుండఁడా ? ఈరీతిని పితామహాశ్చ, ప్రపితామహాశ్చ నిలచిన.

వాఁడు గతాను గతికులకుఁ దగుపాటికాలము మాత్రము శోకము పెట్టవలయు విధాయకముగదా. అట్టి యట్టిదానిని నిరంతరశపథముగ మార్చుట, మొండితనమనుపించుకొనును. బండతనమనిపించుకొనును. రాకాసితన మనిపించుకొనును. మగధీరునకుండఁ గూడని విషాదము, అంటఁగూడనికించ, దైవమునకుఁ బ్రతిఘటనఁ గనపఱచుతత్త్వము, నిబ్బరములేని గుండెకాయ, దుందుడుకుఁజెందు మానసము. చెప్పఁబోయిన నీయుపమలే పుంఖానుపుంఖముగ నగపడును.

ఈధర్మోపన్యాసములకుఁ దుదియుండునా? ఇంకను వినినయెడల హ్యాంలెటుకు మతితప్పునని తలఁచెను. డెన్మార్కు నుండి పాఱిపోవలెనని తలఁచుచుండెను. జర్మనీ చదువుల శాలకుఁబోయి తనచదువులకుఁ దిరిగిదిగవలెనని పూనుకొనెను. కాని మాతృనాజ్ఞ శిరసావహించి ప్రస్తుతము మానినాఁడు. ఈవిషమావస్థయందు, అతనికి మనసు దేనిమీఁదను వాలుబోవకయుండెను. కల్లసన్యాసికి సమస్తమును నిరర్థకము; వ్యర్థము; సారములేని జీలుగుబెండు. చప్పిడి. లేనిపోని గందరగోళము. ఈలోకమో, కలుపుఁదీయని యారామమునఁ గలుపుమొక్కలు ఫలింపునకు వచ్చుటయు, కుక్కపొగాకుచెట్లే పుగఁబెచ్చుపెఱిగి విజృంభించుటయును (తనపినతండ్రి వలె) అక్కఱకువచ్చు తరువులు దారుణముగ నొక్కత్రుటి మాత్రమునఁ (తనతండ్రివలె) గుంగిపోవుటయును, ఏడ్పులు, పెడబొబ్బలు, తప్ప యీలోకమున నేమిబాపుకోనున్నది?

నిమ్మపండు, పసినిమ్మపండువంటి యీదేహము, పండువంటి యీదేహము, గుమ్మడిపండువంటి బొజ్జ, అంతయును

కరగి దానిపాటికది యంతరించి పంచభూతాత్మకమయి పోయిన నెంత బాగుండును ? లేదా, వానిబొందపొక్క! ఆయుష్కరబ్రహ్మ, శాశ్వతబ్రహ్మకల్పుఁడు, ఆత్మహత్యకు వెలి వేయకపోయినయెడల నెంత బాగుండియుండును ? ఓ దైవము! ఓ దైవము ! నాకెన్ని పాట్లు తెచ్చిపెట్టితివి ? ఈలోకములోని వారు, భోగములు భోగములు, అందురు. నాకు నచ్చినవి కావు. అంతటివియును మంటివాసన; అంతయును మట్టివాసన. “పాడిన దేపాటరా, పాచిపళ్ల దాసరి’ అనునటుల చర్వితచర్వణము. చప్పగా నుండును. తలబరువు మిక్కుటము. పైగా నిరర్థకము. ఛీ, ఛీ, దాని మొగము తగులవెయ్య. ఈ తోటకుఁ గలుపుత్రీయు మగవాఁడు లేనేలేఁడు. మగపురుగు మగనలును లేనేలేదు. కలుపు నిండుకలగలుపయినది. చీడ మొక్కలు, చీడమొల్కలు పీడ మిక్కుటముగ నున్నవి. నాకుఁ బట్టిన యీ యవస్థకు దురవస్థకు నే నేమనుకొందును ? చచ్చి గెంపుకేలలు సూత్రము. అబ్బే, అంతయును లేదు. రెండుకూడ లేవు. అంతటి మహారాజే ! నక్కయెక్కడ ? దేవలోకమెక్కడ ? ఆయనకును, యీయనకును, సాపత్య మెక్కడ ? కోకిల, బొంతకాకి సాదృశ్యము. ఆయనకు మా యమ్మ యనిన నెంతటి ప్రేమ ! ఆమె మొగముమీఁద గట్టిగ గాలినికొట్టనియ్యకపోయెనే ? ఇహపరములారా ! ఇహపరలోకములారా ! త్రివ్వినకొలఁదియును వచ్చుచునేయుండును. ఆయనను జుట్టుకొని, యూగిసలాడుచుండెడి దామె. ఆ పేక, ఓడిగారుచునుండెడిది. సెలయయినదా ? నాకు వెఱ్ఱియెక్కి పోవుచున్నది. చాంచల్యమా! నీ మొగముమీఁద, నోసటమీఁదఁ

"స్త్రీ' అనివ్రాసిపెట్టియున్నది. ఒకబుల్లినెల. మానాయన గారి శవమును వెంబడించిననాఁటిచెప్పులు, యిప్పటికి, అరగనే లేదు. 'నీలకంఠాయనమో' అనిన యామె, ఆ, ఆమె— ఆమెమాటను విడిచిపెట్టుము. మృగముమాట యనుకొందుము. తెలివితేటలుండవుగదా. అట్టిమృగముకూడ నింకను, యెక్కుడుకాలము, యేడ్చెడిది— నాపినతండ్రిని ముడివేట్టుకున్నది. నాతండ్రితమ్ముని. అయినమాత్రమేమి ? ఒకరి పోలిక లొకరికివచ్చునా? నేను హెర్క్యులీస్, ఒకభీముఁడను అనుకొనిన నాభీముఁడనే యగుదునా ? నెలకూడ నిండలేదు. పాడుయేడుపువల్ల, జ్యోతులయిన నాకళ్ల యెరుపు దిగకపూర్వము, తగ్గకపూర్వమామె పెండ్లియాడినది. ఎందుకువచ్చిన యడావిడియిది ? పడకప్రక్కల మడత లేమి చకచక వేయుంచి వది ! వావివరుసలనుచు నొకటియున్నవా ? కొత్తకాలము, మంచుకాలము, మండించుకాలము, మంటఁబెట్టుకాలము, మంచికిగా లేదు. ఇఁకను నేను నోరుకట్టివేసికోవలెను. నోరు మెదిపిన, గుండెలవియును. గుండెపగిలిన, తుతునియలగును.

కామసుందరియగు ఒఫీలియా(Ophelia)మీఁదఁ దన కుఁగల ప్రేమానుబంధము సయితము హ్యామ్లెటును దనగోడను నుండి మరలింపలేకపోయెను. ఏడుపు, ఒకవిధమునఁగాదు, ఒకత్రోవనుగాదు; ఒకతెన్నునఁగాదు. తనతండ్రి పోయినందులకొకయేడుపు తనతల్లి యిప్పుడు చనిపోయినదానికంటె నికృష్టములే, నాకష్టము ఎందుచేత ? తనజనకునియెడల నామెకు వాస్తవముగఁ బ్రేమ యుండెడిదా? లేక యంతయును నటనయా ? నిజముగ నుండినపక్షమునఁ జాంచల్యము, చల

చిత్తమ్ముగఁ దారుమారయినదా ? ఏదినిజము ? ఏదిపొల్లొక్కొ? ఆమెవిషయమున భర్తయగు పెద్దహ్యామ్లెటు, యెంతటియాప్యాయతతో మెలఁగెను ! ఆమెయొడలను నొకయీఁగనుగూడ వ్రాలనియ్యకపోయెనే ? ఈదురుగాలి వీచినప్పుడెల్ల, నామె మొగ మేమైపోవునో యని త్రుళ్లినట్టి భర్తయే. ఇంకొకఁడు ఇంకొకఁడుకాఁడే. వాఁడేవాఁడు. తూలితిని, తూలనాడితిని, ఆయనతే. ఆయన మానాయన. అద్వితీయుఁడు. సాటి నేను చూడను, చూడఁబోను.

హ్యామ్లెటు నిక్కువముగ నిర్భాగ్యపు బామోదరుఁడు. స్వేచ్ఛతో, ప్రమదముతో, దేహత్యాగము చేసికొనియే యుండును. మధ్య నీసైంధవలడ్డు యడ్డుపడినదిగదా ! ఆత్మహత్య శాస్త్రనిషిద్ధము, నిషేధము. పాపమేమిచేయఁగలఁడు? ఒక స్నేహితునకుఁగాని, తన దేశమునకుఁగాని, యపారమగు ప్రేమామహిమవలనఁ దనప్రాణమును కానుకగ సమర్పించుట, అర్పించుట, కొనియాడఁదగినదిగాని, యొక పిఱికిపంద వలె, చేయవలసిన కర్జమును విసర్జించి, కష్టనిష్ఠురములకు దవ్వాయిఁ పప్పుజారునట్టు, జారిపోవుట యిసీ, యిదియు నొక బ్రదుకే, యిదియును నొకమగతనమే ? తాను జేయుటకు నొక కష్టతరమగు కార్యము తనమీఁద పైఁబడునని హ్యాంలెటుకు, అనతికాలముననే గోచరము కాకున్నది. తనమిత్రులలో డేవిడ్‌కు (David) జొనొథన్ (Jonathon) వలెన, దామనుకు (Damon) పితియస్ (Pythius) వలెన, హొరేషియో (Horatio) యనునొక పిన్నవయస్కుఁడు, సమానవయస్కుఁడు, హ్యాంలెటు కాప్తుఁడుండెను. ఒకానొక దిన

మున నీహారరేషిరోయున్న,యిద్దఱు కావలివాండ్రును వచ్చి
రి. వింతకథ నొకదాని నేకరువుపెట్టిరి. ఎంతవఱకు నిజమో,
ఎంతవఱకు స్వప్నమో, చూడఁగాఁ జలిమిడిముద్దలే యయి
పోయినారు— భయము, ఆశ్చర్యము. ఱేఁడుమూఱులొక
చిత్రిస్వరూపము, సురూపము, సరసరూపము, రసగంధరూ
పము, గంధర్వరూపము, వెళ్లిపోయినరాజు, గిట్టినరాజు,
రా రా జు, రా జా రా జు, రా జం రా జు, ట పా
కట్టివేసినప్రభువు, అబ్బబ్బా! అచ్చంగా, ఆయనయే. గడ్డ
ముతోఁగూడ సరిపోయినది. నలుపురంగులోఁ దెలుపు వెండి
తీఁగలవలె నట్టిటు నూఁగిసలాడుచున్నది. సమయము నరిగ
నగ్థరాత్రి; నట్టనడినిశ. స్థలము కోటబురుజులు. నఖశిరపర్యం
తము కవచము. ఆపాదమస్తమినుపతొడుగు. మొగమువీఁ
ది మేలిముసుఁగు నెత్తినప్పుడు, పాలిపోయినట్టును శోకాన్విత
మయినట్టును గనుపించినది. ఈవృత్తాంతము వినినతోడనే
హ్యాంలెటు యేమియో యయిపోయినాఁడు. ఏమి యయిపో
యినదియు నాతనికే తెలియదు. ఊహించుకొనుటకు మన
మొగము మనకేమి తెలియును?

ఆరాత్రియే, ఆస్థలముననే, కనిపెట్టియుండుటకు మన
స్ఫూర్తిగ నిశ్చయించెను. పెద్దప్రొద్దుతద్దయుఁ బ్రిభూతాశ్చ
ర్యుఁడయి, యిట్లని తన లోలోన నాత్మగతంబున వితర్కించె
ను. ఏమియిది! మాతండ్రియాత్మ, ఆయుధములతో—ఏమి
యును సవ్యముగ లేదు. సబావుగలేదు. నాకనుమానముగ
నున్నది. ఏదియో ప్రమాదికమయిన మోసకృత్యము సాఁ
గినది. రాత్రివచ్చినది. రాత్రితోటి తోఁడఁబుట్టువులు చలి

యు,మంచుయు తొండుయు నీడయు నయినవి. అయినను,ఆకాశము ప్రకాశముగాను, స్వచ్ఛముగాను, యున్నది. హ్యాంలెటుయును మిత్రులును గలిసి ముచ్చటలు గావించుకొనుచుండగ, వందువెన్నెలలో, పుచ్ఛపువ్వువంటి వెన్నెలలో, గ్రహముకాదు, విగ్రహమే, విగ్రహముకాదు, సురూపము, సురూపముమాత్రముకాదు, జీవకళ యుట్టిపడునట్టి, నిండుకొనియున్నట్టి మహారాజా హ్యాంలెటు. చూడగనే, కుమారరాజా, పోతబొమ్మవలెను, నిర్జీవపుబ్రతిమవలెను, భయమొక ప్రక్కను, విస్మయమింకొక ప్రక్కను, యేది ముందావహించునో చూతమని సూటీపోటీల పందెములు వేసికొనినట్లు, వలరాచ వేగిరమును, వాయువేగమును, మనోవేగమునగూడ మించినవి. ఒకక్షణము పరకాయింపు, తనతండ్రియే యను నిశ్చితాభిప్రాయము, భయము నట్టేటువిడలించి పాఱవైచినది. పాఱవైచుటమాత్రమేకాదు. తానాస్థలమునఁబాతుకొని చనవుయొయి,నాయనా బాబాయని పలుకరించెను. నీయీరాకకు భావమేమి ? డెన్మార్కుడెన్మాధీశా! చెప్పవే ! యనెను. కుఱ్ఱవాఁడు హ్యాంలెటు జవాబుకోరినాఁడు. కోరినదిజవాబు, పితృభూతము చెప్పవలయు సందేశము కావలసినంతయున్నది. మేఘసందేశముకాదు. పితృసందేశము. పితాసుతులువినా, మూఁడవనరపురు గీమాటవినరాదు. తననుమాత్రము వెంట రమ్మని యొక్కసైగ వేసినది హారేషియోయును మఱియిద్దఱు కావలివారును, హ్యాంలెటును వలదువలదని చెంగుపట్టుకుని, జెబ్బపట్టుకుని, చెయ్యిపట్టుకుని, గడ్డముపట్టుకుని, వారించిరిగాని వారిని విదలించినాఁడు. అదలించినాఁడు. కోటబురు

జులకుఁ బైన దూరస్థలమునకు వెంటఁబెట్టుకొని పోయినాఁడు. అక్కడకుమారుఁ డాగినాఁడు 'ఉపక్రమింపుఁడు' అనినాఁడు. "నేనెవరను అనుకొన్నావు?' నేను నీతండ్రియొక్క భూతమును. నీతండ్రియెడ, నీకొకింతయైన నాపేక్షయున్నదా? ప్రేమయున్నదా? ప్రీతియున్నదా? అనురాగమున్నదా? ఇవియన్నియు నున్నయెడల, నేఁజెప్పుమాటను బాగుగవినుము. ఆయనకుఁ జరగిన ఘోరకలి, ఘోరహత్యను, కసితీర్చుకొనుము.

ఖూనీయా? అని హడలుతో హ్యాంలెటు, అఱచినాఁడు. ఇంకను ఖూనీ, యనియనుమానమా? దారుణముగ జరపినారు. అని రెట్టించెను. విను, నాపూదోటవనమున నేను బరుండఁగా, నొకవిషసర్పము నన్ను కఱచినదని చెప్పినారు. డెన్మార్కు దేశము యావన్మందిజనులు, ఆబాలగోపాలము, వ్యాసప్రోక్తము, వేదఘోషవలె, చెవులారవినినది. మనసార నమ్మినది. కాని, నీవు తెలిసికొనుము పడుచుకుఱ్ఱా! నీతండ్రినిఁ గఱచిన సర్పమేసుమీ యిప్పుడాతని కిరీటమును దాల్చుచున్నది. నాపినతండ్రియేనా, యింతటిపని చేసినది? ఇంతటినిర్వాహముచేసినది? ఎంతపని! అనుచు నిర్ఘాంతపోయి గోలపెట్టెను. ఆభూతరూపము, యింకను యేమియో చెప్పసాఁగెను. ఈమాయావి, క్రూరుఁడు, సర్పము తాను సుషుప్తిలోనుండఁగఁ దనచెవిలోఁ గాలకూట మహావిషమును పోసి చంపుటయేఁకాక, తనచాతుర్యముతోను, మోహినీ విద్యతోను, యక్షిణీవిలాసముతోను, రాజ్ఞినిఁ దన మాయా వాగురమునఁ బడవైచుకొని యొక జంత్రపుబొమ్మవలె నాడించినాఁడు. పూర్తిగవినుము.

వాఁడే, తుచ్ఛుఁడు; మనిషి కాఁడు; మృగము; తెలివి బహుళఅపరిమితము; కడుసమర్థుఁడు. అంతయును బూడిదలోఁ బోసిన పన్నీరు. ఏమిసార్థకము? చెడుగుకుఁ జేసైగ వైచు, హుషారునిచ్చు తెలివితేటలు. రాణిని మడవిఱిచి తన కుడి జేబులో వైచుకొనినాఁడు. ఇప్పుడు శ్రీరంగనీతులు పలుకు రాణి, హ్యాంలెటుకుమార! ఎంతటిపాటుయో చూడుము. పెండ్లిపీటలమీఁదఁ జేసికొనిన బాసలు బాసకు—అడ్డబాస, అడ్డుబాసయయినది. అసడ్డుబాసయినది. అనడ్డుబాసకుఁ దిగినది. అట్టినానుంచి యొదిగిలి, వాఁడి, ఆదుగాత్ముని చెట్టఁ బట్టినది. నాలో నెన్నియవవంతువాఁడు? కానిమ్ము. నాకేమి కొదువ? చెప్పు శ్రీరంగనీతులతోనే మోనపడిపోదునా? త్రిప్పు రుద్రాక్షల తావళములు, తులసిపూసలు, వైకుంఠము నోట గఁబెట్టునా? ఇంకొకతోవ త్రొక్కుదును. నాపడకపాన్పున నుండినది రాకాసి. అయిననేమి? వెనుకటిగుణమేల మానును? తనమేఁతలు తనవి. నాగీతనాది. ఉండుము. ఉదయవాయువులఁ బసిగట్టుచున్నాను. నేనిక్కడ తడయుటకు వీలులేదు. వినుము. మధ్యాహ్నకాలమున, నాతోఁటలోఁ బండుకొనుట నాకెప్పుడును, యలవాటు. అట్లు పరుండఁగా, నాగ్రహపాటు కాఁబోలును, నీపినతండ్రి, చీమను చిటుకుమనిపించకయే, అడుగులమీఁది యడుగులువైచికొని, వచ్చి, పిల్లిఅడుగులు అంటే, పిల్లిఅడుగులుయేను, గుండెమీఁదఁ జెయ్యివేసికొని, కాలిమీఁదఁ గాలువైచుకొని; అనఁగా నంతనిర్భయముగ, పరుండఁగ, నంగరక్షకులు సమీపమునలేని తరుణమున, కాలకూటమహావిషమును దొప్పలోనుంచుకొని, నాచెవిదొప్పలో

జారవిడిచినాఁడు. "పూరయిత్వా" అయినది. అదిపడఁగనే, నాచర్మము గజచర్మమయినది. మనిషిరక్తమునకును దీనికిని బద్ధవైరము. లోనికిఁబడుటయే తడవు. పాదరసమువలె నతిత్వరితముగ దేహముయొక్క యన్నిమండువాలు, వసారాలు పంచలు, అన్నిద్వారములగుండ, వాహినియయి విరిగిన పాలవలె, పలుచని యారోగ్యమగు రక్తము కుదుపులు కుదుపులు కట్టి, పండువంటి నావళ్లను బాడుచేసినది. ఇఁక నేనేమిచెప్పుదును! నిద్రలోఁ దమ్మునిచెయ్యి, చెయ్యి, నన్ను టపాను గట్టించివేసినది. ప్రాణమొకమూల, కిరీటమొకమూల, రాణి మతిరియొకమూల, మూఁడును, మూఁడుత్రోవలు పట్టినవి. నాపాపములేమియును బండియుండలేదు. సన్న్యాసము పుచ్చుకొనియుండలేదు. కాంతులుతీరలేదు. నాతలకు లోటులన్నిఁటినిఁ గట్టఁబెట్టి, తాటాకులనుగట్టి, సాఁగనంపినాఁడు. తలఁచుకొన్నిన, గుండె ఝల్లుమనును. నీకుఁ నామీఁద నాపేక్ష యుండినయెడల నిదియంతయును విని సహింపఁగలవా! ఓర్చుకొనఁగలవా ! డెన్మార్కు సంస్థానాధీశ్వరునిఁ బడకపాన్పును, పడుపుఁబాన్పును గానియ్యవలదు. దీనిని నీవు సాధించు యత్నమున నీమనసును జెడఁగొట్టుకొనవలదు. నీతల్లిజోలికిఁ బోనియ్యవలదు. ఆమెను దైవమునకు విడువుము. పైగా, ఆమెగుండెలో ముండ్లపొద యుండనేయున్నది కావలసినంత యామెను గ్రుచ్చును, కుట్టును, పొడుచును. కలకాలము నీవు బాగుండుము. తెలతెలతెల్లవారుచున్నది. నాయనా వెళ్లుచున్నాను. నన్ను జ్ఞప్తియం దుంచుకొనుము.

ఇఁక విచారగ్రస్థముగఁ దానావలిలోకపుఁగాపు; ఇంకను బాఁతకాపుకాలేదు. మాసములప్రాయము రెండుకూడ నిండలేదు. ఈ మనలోకము, యిహలోకమునఁ దిరిగిన త్రిప్పటలు, మరఁగిన భోగములు, చేసికొనిన శోకులు, వేసిన వేషములు, మేసినమేఁతలు, కూల్చినకొంపలు, దూరిన గూడెములు, ఎగసనఁదోసిన సమిధలు, ఆర్చిన మందుదీపములు, తీసిన నిండువిస్తరులు, ఎత్తివేసినపీటలు వేయేల ? సత్ప్రవర్తనమునుండి దిగజారులు, పాపములను, లోపములను, లోటుపాట్లను, మఱియింకను యేమైనను, యేమైననేమి? ఈకొదువలకుఁ దగినశాస్తిని, అనుభవమును బ్రతిజీవుఁడును బరలోకమున ననుభవింపకతప్పదు. ఏతన్మూలమునఁ బశ్చాత్తాపము ప్రజ్వరిల్లి, యాదివఱకావరించియున్న డాగులను, కశ్మలమును నూడ్చివేసి తప్తకాంచనమును నిలుపును. ఈ లోకమునకు వచ్చుట కుత్తరువునుదీసికొని తన యతిరహస్యపు ఘోరకృత్యను బైటపెట్టుటకుఁ, వెళ్లగించుటకుఁ, గసితీర్చుకొనుటకు వచ్చితిననియుఁ జెప్పెను. కాలచక్రము నిరంతరము తిరుగుచుండును గదా.

‘దినయామిన్యౌ, సాయంప్రాతః శిశిరవసంతౌ
పునరాయాతః, కాలః క్రీడతి, గచ్ఛత్యాయుః’

రాత్రికాఁగానే, తిరిగి తెల్లవారకతప్పదుగదా. మొగిలిరేకులవలె, తెలతెలవాఱవచ్చెను. క్రమశః చిమ్మచీఁకటి, చీఁకటియగును. సూర్యనారాయణమూర్తి తలయెత్తును. ఈ రాచభూతము నిజస్థావరము చేరుకొనవలెను. పదములు వెనుకకు లాగుచున్నవి. మనసులోని యుమ్మలికము నెంతచెప్పి

నను, హృదయభారము తగ్గదు. శోకతప్పదు. విషమావస్థ. గారాబుపట్టీ! వెళ్లుచున్నాను. హ్యాంలెటుకుమారా! మారాకువలదు. క్షన్తు జ్ఞప్తియం దుంచుకొనుము. దీర్ఘాయుష్మాన్భవ. చెప్పపాటుకూడ కాలేదు. మటుమాయమైపోయినాఁడు. హ్యాంలెటు బిక్కమొగము, బక్కపేగు, తానును, దిగాలున మిగిలితిమి. ఈ తెలిసికొనిన విషయములతో హ్యాంలెటుయొక్కగుండెలును, తలయును నిప్పునిూఁదవైచి పొరలించినట్లు అయినవి. నిన్ను జ్ఞాపకముంచుకోవలయునా? నిన్ను జ్ఞాపకముంచుకోవలయునా? ఇదియే నతనికిఁ దారకమంత్రము. స్మరణ యిదియే. స్ఫురణకూడ గలిగినది. తన గొంతునఁ బ్రాణముండువఱకును దీనిని మఱువఁడు. మన నసంయుక్తంబు గావించినాఁడు. హారేషియోప్రభృతులు మళ్లు మొగముపట్టిన హ్యాంలెటుయొద్ద కమాంతముగ వచ్చి యేమిజరిగినది? అని ప్రశ్నించిరి. హ్యాంలెటు యేమియు ననఁడు. భూతదర్శనము విషయముమాత్రము బహురహస్యముగ గుంభనగ నుంచవలసినదని యాముగ్గురిచేతను బ్రమాణములు చేయించుకొనెను. కాలము కీలూడినది; తొలఁగినది. వక్రించినది. వక్రత ప్రాకారము గట్టినది. నాపాపపుఁగర్మము నేనేమనితిట్టుకొందును? దానిని సరిచేయుటకుఁ జక్కఁజేయుటకు, నేనేల పుట్టవలసివచ్చినది? దరిదాపులేని పెన్చీతల మునుఁగుచునుంటినే? అనుచరులకు గమ్యస్థానమునకుఁజేర్చి, హారేషియోయును-ద్వాత్మను స్నేహితులిరువురును, యేకాంతముగనుండి హారేషియోకుఁ బూసగ్రుచ్చినరీతిని యాద్యంతము స్పాంతముగఁ జెప్పెను.

# HAMLET.

## PRINCE OF DENMARK.

# హ్యాంలెట్.

డెన్మార్కు కుమారరాజా, హేమాహేమీ.

---

## వింతవిభ్రమకాండము.

---

"సీ. కనఁ డొద్ద నున్నవారిని వీరు వారని
కనినఁ దదర్హ వర్తనలు మఱచు
వినఁడు చెప్పినపల్కు వేమఱుఁ జెప్పక
విని నే మే మంటిరనుచు నడుగు
జనఁ డెత్తు లిడక మజ్జనముఖ్యవిధులకుఁ
జనినఁ దబ్బిబ్బుగాఁ జలుపుఁ గ్రియలు
కొనఁడు నానాసేవకులసేవ లెవ్వియుఁ
గొనినవీడ్పాటుగాఁ బనులుపనుచు."

హ్యాంలెటుకుగుండెలవియు రహస్యపుగాథ తనతండ్రిహత్య, శల్యగతమగు యుండియును, యేరీతిగ నుచితంపుమారణ హోమముచేయునదియును, సునిశ్చితము చేయలేకపోయెను. క్లాడియసు, యెల్లప్పుడును బరిజనావృతుఁడే యగుచుండెను. స్వభావమువలన నతఁ డనుమానాస్పదుఁడు. భీరుత్వముకూడ మిళితము. ఇట్టిసందర్భమున రహస్యభంగము వాటిలకుండ హ్యాంలెటు బహుజాగరూకతతో, బనిపూనపలె

ను. తనమనసునఁదుండు కలఁయును, చేవగింపుయును క్లాడి యసుకణుమాత్రము పొక్కనియ్యఁగూడదు. పొంగనియ్యఁ గూడదు. లవలేశము తెలిసికొనుటకవకాశమియ్యఁ గూడదు. ఇచ్చినఁ దనమనోరథము విఘ్నాకులంబగు, ఉన్మాదునివలె, తననడవడిని లోకులమీఁదికిఁ బ్రతిబింబించుచుండెను. తన నేస్తకాఁడు హరేషియోకుఁదప్ప, యీవిషయమితరుల కాశయముకాకుండు. గెర్ట్రూడ్ రాణిమనస్సు తేళ్లను, జెఱ్ఱి లను ద్రొక్కినటులయినది. హ్యాంలెటు తనతండ్రిచావునకు మితిమీఱినవగపుయును, ఆమెయొక్కయడావిడిపెండ్లియును, అతఁడిమనసు యంచునూడగొట్టినవని భీతిలసాఁగెను. క్లాడియ నుకూడ తత్తరిల్లి, యేమిచేయుటకును దోఁచక, మిన్నకయుండు టకంతకంటెను మనసురాక, బ్రదుకుజీవుఁడా, హ్యాంలెటు ములుకులవంటి మాటలననుచున్నాఁడు. ఏమిచేయుదును ! అనుసంధిలోఁబడినాఁడు. కిష్కింధమగుకాండము, సుందరి కాండకుఁగదా యీకిష్కింధాకాండము !

ఆటోపి, పటాటోపి, యింటిపురుగు, రాచనగరిదాసు పొలోనియసు (Polonius) రాజుగారి, రాణిగారియొద్దకువచ్చి, అతియక్కఱతో తానాయువరాజుయొక్క మతిభ్రమ, మనో వైకల్యమునకును గలిగినవాస్తవకారణమును, మర్మమును, ఆయువుపట్టును గనుగొంటినని చెప్పెను. అంతకంటె, మఱి యేమియును లేదు. ఎక్కువయును లేదు. తక్కువయును లేదు. తనకూఁతురు, ఒఫీలియా (Ophelia) మీఁది యనురాగమే. ఇందుకుదృష్టాంతముగా, హ్యాంలెటు స్వహస్తూలిని యొకకమ్మఁ దెచ్చి బిగ్గరగాజదివెను. 'నక్షత్రములు పావక తేజస్సు కాద

ని యనుమానమా', రవిచలనము కాదని సంశయమా ? వీటి కన్నిటికి ననుమానముండిన నుండునుగాక ! నా ప్రేమకు మాత్రము శంకవలదు. ఇంకను, యేమేమియో లిఖయించి, తనజీవాత్మ యొక్క విగ్రహమును ఒఫీలియాకు, అత్యుక్కటంబగు ప్రేమను బాగచేయుచుఁ దనస్వకీయవిలాపము నాకమ్మయందు గునం జెక్కెను. పితృనాజ్ఞ చొప్పున నాజాబును, ఒఫీలియా తండ్రివశము చేసెను. కాని మనసున కాందోళనము కాసాగె ను. హ్యాంలెటుకుమారరాజాకు, ఒఫీలియా తనహృదయకమలము నర్పించి వేసినను, తనతండ్రియును, అనుజన్ముఁడు, లెర్టిస్ (Laertes) యును, హ్యాంలెటు చెప్పినవిషయములలో నొక్కటిసరునయినను విశ్వసింపవలదని కఠినముగ, నిష్కర్షగ మందలించిరి.

వానివేషభాషలు మధురతమముగనుండినను, తాత్కాలికము, నిమిషమాత్రవిలసనము. అంతకుమించ లేదు. ఇప్పుడీక్షణమునందు, నిన్ను ప్రేమింపవచ్చును. కాని యేమిప్రయోజనము? హ్యాంలెటు స్వతంత్రుఁడుకాఁడు. వివాహవిషయమున జనసామాన్యమునకుఁగల స్వతంత్ర్యముకూడ నాతనికిలేదు. అతనియెన్నికయందు డెన్మార్కు రాజ్యతంత్రము యొక్క క్షేమస్థైర్యము లిమిడియున్నవి. ఏవిధమునఁబరకాయించిచూచినను, నీమానమున కెంత ముప్పుకలుగునో, నీపేరు ప్రతిష్ఠల కెంత దుర్యశమువాటిల్లునో, ఆలోచించుకొనుము. అతనిలోల్లాయిపదములు నీవువినఁ గిట్టదు. నీగుండెనిబ్బరమునకు సల్లనీయుకాదు. ఒఫీలియా, మందమతికాదు;

మందకొడియుఁగాదు. అన్న తనయందుఁగల సహజభ్రాతృ వాత్సల్యముననే చెప్పెనని తెలియును. ఆఁడుదానికుండవల యు మానము, మానుషముల నామెకాపాడుకొనవలయు నని నచ్చఁజెప్పెను. మాటలు హితముగ నామెకుఁ గనఁబడి నవి. బహుగు, ముదుసలి, ఆమెతండ్రి యింకొకపరుగు యెక్కువవేసెను. ఒఫీలియా, బహుఅమాయుకపుఁబిల్లయనియు, సభ ముఖశుభము నెఱుంగదనియును, రాజకుమారునిపలుకులు భేషజములనియు, తనను వేసికొఁదలఁచి పన్నినవలలనియు, ఆయనకుదవ్వులన నుండవలయుననియు. మాటపలుకులకు దూరముకావలసినదనియు బోధించెను. హ్యాంలెటు తనతోఁ పెద్దమనిషిదర్జాగా సంభాషించెనని చెప్పినను, వినుగుదలతో, 'దర్జా' అనినీవనిన నందువులే. అనిపోలోనియసు, అనినాఁడు. మాటవరుసకు, హ్యాంలెటుకు నామెఁపవివాహమాడుట కిష్టమే య్యైనను, అతఁడికోర్కెనీఁ గొనసాఁగనియ్యరు. గొప్పరాచ వంశీకుఁడు. అందనిమ్రానిపండు. ఆఱ్ఱులుసాఁచిన నేమి లాభము? ఈగాథకంతకును బర్యవసానముగ, నొఫీలియాకు హ్యాంలెటువ్రాసిన యీకమ్మం జాలువదలెను. నిక్కవముగ హ్యాంలెటుకడసారపులేఖగ సాఁగనంపెను. ఇప్పుడుపూనుకొనిన కడు యీదుర్భరకార్యమునకుఁ దనకళ్యాణముగిట్టనిపొరుగు, ఒఫీలియారెడల హ్యాంలెటుకు, ఆఁనిప్రేమమాత్రమున్నట్టు తెలుపుట, మానలేకపోయెను. ఇదియె, ఆఖరుకమ్మ. తుది కమ్మ. కమ్మనికమ్మ. ప్రేమాపాశముల నూగిసలాడినకమ్మ. కడసారపుఁ గమ్మ. కడుసారపుఁగమ్మ. బహువారపఠితం బయ్యు నవోత్కంఠఁ గలుగఁజేయుకమ్మ. రాజదంపతులు

మాత్రము ముదుసలిపొలోనియసు సరియుసుగా, పసికట్టి యుండునోపునని సంతసించిరి.

పొలోనియసు కొంచ ముడావిడిమనిషి. తన్నువిడిచిన, రాచప్రపంచము లేనేలేదనుకొనుమనిషి. భార్యయుండినట్లు కనపించదు. అయున్న యొక్క కొడుకును, కూతును, జూచు కొనుచూ గాలమును వెళ్లబుచ్చుచున్న మనిషి. పెద్దహ్యాంలెటు రాజుగారి మరణదివసములకుఁ గొడుకు పొలోనియసునను ఫ్రాంసు (France) దేశముచదువుల, గరిడీలసాలలనుంచి పిలిపించుకొనినాఁడు. తిరిగి యాదేశమునకుఁ బోవలయునని తహతహ. విశ్వప్రయత్నముచేసి, కొత్తరాజుగారిచేతఁగూడ, 'ఊఁ' అనిపించుకొని ప్రయాణత్వరలోనున్నాఁడు. అంభము లోఁ గుంభము. ఆదివారములో సోమవారము. తనచెల్లెలి ఒఫీలియా పెళ్లియుట్టలు, యత్నముహాటాహుటి. తనకుఁ దోఁచినమట్టుకు, చెల్లెలికిఁ బథ్యముగ సంగతులు చెప్పినాఁడు. మనము వినియేయున్నాము. నాతికిమానంబుతోడవు. మిగి లినవితోడుగులు. బోటికిఁబ్రాణముమానము. ఆఁడుదానికి మానముఁ మానుషము. వీటికిముప్పము తెచ్చిపెట్టుకొనవల దు. తేల్చిననిగ్గుయిది. తండ్రిప్రాణము కొడుకుపయనమై పోవునప్పుడు, మంచిబుద్ధులను మప్పక మానఁగలదా? "ఆరూఢిగసకలజనులు, నారాయనఁగా, ధారాళమైననీతులు నోరూరఁగచవులుపుట్ట" నుడివినాఁడు. అసారమిది. నేరెటేటి యసలు.

నాయనా! నీయాలోచనలను నోరుదాఁటి బయలు

వెడలనియ్యకుము. లేఁతయాలోచనలను, కార్యముఁక్రింద ముదరనియ్యకుము. నీవుకావలసినంతచనవుగనుండిన నుండు వుగాక. పచ్చిపచ్చిగమాత్రి ముండకుము. అతిసాద్యాగా, కూడ కనఁబడకుము. స్నేహితులని, నీవనుకొనినవారిని రత్న పరీక్షచేసి, ।నీబొందెకు, యినుపకట్లతోఁ గట్టివేసికొనుము. అంతియగాని, దొరకిన, చిక్కిన, బొడ్డూడని, తెక్కలురాని, ముక్కుపచ్చలారని ప్రతిపక్షిని, అప్పుఁడనిభావించి, విందు లిచ్చి, గోవిందలుకొట్టించి, ధనమును క్షౌరముచేసికొనవద్దు. తగవునకుఁ గాలుత్రివ్వవద్దు. అట్లుగావించితివా, ఎదిరి వాని నోకయాటయాడించి, మట్టివిడిచిపెట్టుము. నీపేరుచెప్పిన గర్భనిర్భేదముగనుండవలెను.

"క. ఎవ్వనితో నెచ్చోటం
జవ్వకుఁ జేసాఁచవలదు, చేసాఁచినచో
నివ్వలనవ్వల[illegible]వ్వరు
నవ్వోకయుండంగఁ బగరవణఁగింపఁదగున్"

ప్రతివానికిని, నీచెవినీయుము, కాని కొరకనియ్యవద్దు. మాటనీయనే యీయవద్దు. ప్రతివాని యభిప్రాయమును దీసికొనుము. నీమాటనుమాత్రము, అట్టేయుంచుకొనుము. నీస్థితికిఁదగినదుస్తులను వేసికొనుము. వెలగలవిగానే యుండ నిమ్ము. రంగులు, పింగులు, ఆడంబరములమీఁదఁబడకుము. ఉడుపులు, ఉడుపులు, అంటే నీవేమనుకొంటివో, లోనిమని షిని, అంగడిలో నట్టనడుమను బెట్టును. ఫ్రాన్సులోనివారి విషయము జగత్ప్రఖ్యాతమేకదా. వేషధారులు. "వాదుసుమీ' అప్పుచ్చుట, నీవొకరియొద్ద నప్పును, పుచ్చుకోవద్దు; యీయు

నువలదు. 'అప్పు' అనుకొనిన నీ నేమనుకొంటివో, యిటు ాడ ముంచును. వావివరుస లెవరికైననున్నవిగాని, మాత్రము లేవు. చుట్టముపక్కము, అసలు కేయిసరు. అప్పు తెచ్చుకొనుటలో, కొంపలుకొంపలే కూలిపోవుచున్నవి. ఈస్త్రీని జెప్పినవన్నియు నొకతల. ఈచెప్పఁబోవునది యొక్కటియు నొక్కతల. అన్నిఁటినిఁ దలఁ దన్నుచున్నది. ఆత్మద్రోహము వలదు. వలదు. ముమ్మాటికిని వలదు. నీకు నీవు శ్రీజాయతిగ, నిజాకృతిగ నుండుము. అవిధమునఁనుండిన ఇంకేమి, కావలసియున్నది. రాత్రి పగలు నెట్లు వెంబడించునో, అలాగుననే, నీవు మఱియొకరికి ద్రోహివి కానేరవు.

ఒఫీలియాయెడల నతనికిఁ గలిగిన ప్రేమాపరవశము హ్యామ్లెట్టుకుఁగలిగిన యీయవస్థకుఁ గారణమనియును, తండ్రి యొక్కమందలింపువల్ల, నోటికిని, చూపునకును మూఁకుడును గంతయును, గట్టివైచి, పెడచూపుయును, మాఱుమొగము యును బెట్టినదనియుఁ దలంచిరి. కుమారరాజా, నానాటికిఁ దీసికట్టు. మిగులు ప్రపంచమునంతయును మఱచినాఁడు. కులాసా చచ్చిపోయినది. మనమువికటించినది ఇప్పటితండ్రి యుండయిష్టత కలిగినది. తిండి యందంతశ్రమించిన యయిష్టత; కాని, సూలింతరాలివలె డోకులులేని వేవిళులు. మెతుకు లోనికిఁబోదు. నీరస మెక్కువకానాఁగినది. బుద్ధికిఁబాటవముతగ్గి చిత్తవిభ్రమకలిగినది. చిత్తమెల్లను జెడియున్నరి త్తయొడలుమాత్రము మిగిలియున్నవి. దానివలననే, ఆతని యీవిలాపములు, యీసల్లాపములు..

ఈసరససల్లాపములు, తిరిగియుత్తరక్షణముననే, విర
సవిలక్షణములు. అందులకే మనమందఱము నఘోరించుచు
న్నాము. క్లుప్తముగఁ జెప్పితిని. ఇఁక నేమి చెప్పుదును ? కారణ
మిదియే యని నీవనుకొందువా? అని రాజుగారు భార్యనడిగిరి.
ఉండునోపు. అసంగతము లేదు. అని హ్యాంలెటుజనని మాఱు
పలుకు. విని పొలోనియసు పొంగిపోయినాఁడు. నేఁజెప్పినదానికి
వ్యతిరేకముగ నెప్పుడు జరగినది ? నేఁజెప్పుటయును, కాక
పోవుటయునుగూడ కూడునా ? అని పొలోనియసు ప్రగల్భ
ములు. క్లాడియసు మఱుమాటాడలేకపోయెను. అయినను,
నిజమగు పర్యవసానము తెల్పుకొనుటకు, హ్యాంలెటు పచారి
చేయుచు, తారునట్టి, మనిషియలికిడిలేని వసారాలో, హ్యాం
లెటును, ఒఫీలియాతోఁ దారసిలునట్లు చేయుటకుఁ దీరుమా
నముచేసికొనిరి. గంటలతరబడి యతఁడు క్రిందకుమీఁదకు,
నెగువకుదిగువకు, యీప్రక్కకునాప్రక్కకు, యీవలకావల
కు, - యిటునటు, నడుగులువేయుచు, మీనముమేషమా ?
మేషముమీనమా? అను మీమాంసములోఁబడి, యేమేమో
యొంచునట్లు, యోచించునట్లు కనుబడుట హ్యాంలెటుకు వా
డుకయయినది. ముదుసలిపొలోనియసుయును, మాయావి
క్లాడియసుయును, దెఱకు వెనుకప్రక్కను దాఁగియుండుట
కును, హ్యాంలెటు, ఒఫీలియాలసందున జరగు ప్రస్తాపనలను,
ఖుద్దునయుండి వినుటకును, జూచుటకును నిశ్చయించుకొనిరి.
ఏకాకిగనుండి, ఏకాంతముగనుండి, యీహ్యాంలెటు చోద్య
ముగఁ గనుబడి, మాట, పలుకు, అనువారికి మిగులవింతయు
త్తరములనిచ్చెను. మతిపోయినదని, వారుగట్టిగ ననుకొందు

రని మనస్సులోనున్నవి కక్కివేయువాఁడు. కక్కుటితో బేర మెప్పుడును లేదు. కడుపునిండిన బేరమంతకు మునుపే లేదు. కడపటి కైలాసమనుకొనునది యుగ్గుపాలనుండియును లేదు. దొరతనపునీటు, గోటు, రాజ్యగరిమయునెట్టివియో నెఱుంగఁ డు. ఈరాచబిడ్డఁడికి గబ్బితనమెఱుంగమితప్ప స్వారస్యమే లేదే ? తప్పక చిత్తచాంచల్యము. అయినను, పొలోనియసు కూడ, అంతటిపిచ్చిలోను దెలివియున్నదే ? తెలివినిమించిన యూహయున్నదే ? ఊహనుమించిన పోకడయున్నదే ? పోకడనుమించిన రాపిడియున్నదే ? రాపిడినిమించిన నలుగుడుయున్నదే ? నలుగుడునుమించిన చినుగుడుయు న్నదే? చినుగుడునుమించిన మూలుగుడుయున్నదే? మూలు గుడునుమించిన నీలుగుడు యున్నదే? వేయేల? కొంతసేపు గుం డుమునిఁగి బెండు తేలును. మఱికొంతసేపు బెండుమునిఁగి బరువెక్కి నీళ్ళ యట్టయడుగునకుఁ బడియేపోవును. అట్టయడు గుననుండుగుండు తనతోంటిబరువును గోలుపోయి, బెండుపడి, డిందుపడి, డిల్లపడి, బుడగలుబుడగలుతో నీటిపైకిలేచుకొని వచ్చి, తేలును. హ్యాంలెటుకువచ్చిన యున్మాదము పొలోనియ సుపుత్త్రిను, యిన్నితలంపులను బుట్టించెను. ఒకసారి ప్రాణము విసికివేసారి పొలోనియసు హ్యాంలెటుతో మహాప్రభూ, మీ శెలవు నేనుతీసికొందును. అనఁగా పరాకునుజెందినట్లు, అను నట్లు హ్యాంలెటు, నేనుమీకు నామనసార యీయనిది, నా యొద్దనుండి మీరేమియును దీసికొనఁజాలరు. మీతరము గాదు. భవసాగరమీదను నాతరముగానట్లు—నా ప్రాణము తప్ప, నాప్రాణముమినహా, నాప్రాణమువినాగా.

ఒఫీలియానుబిలిపించి రాణిగారు బహుయాదరణచేసిరి. హ్యాంలెటుకీ దాంపత్యమునఁ జెడినమతి విఱిగినయెడల, పట్టిన దయ్యము విడిచినయెడల, రాణిగారికీ వివాహమిష్టమే. ఆమె లోపాలోపము లెట్లున్నను, హ్యాంలెటు తనకు ముద్దుపంపు బిడ్డఁడు. నీసౌందర్యవిలసనమే, మాహ్యాంలెటుయొక్క దుం డగములకుఁ గారణమైయుండనోపును. అగుపక్షమున, నీసు గుణము లతనిని యథామతికిఁదిరిగి దింపినయెడల సాధన్యత యింతయంత యనరాదు. అని ఒఫీలియాతో వనెను. నాకో రికయు నదియేనమ్మా. అని ఒఫీలియాబదులు. కాని, అనతి కాలముననే, హ్యాంలెటు, ఆయుత్తరక్షణమునఁ దలఁచునది యామెరుగాదని తెలిసికొనున్నది. ఒకగ్రంథమును గెంగేలఁ బూని తననియమితస్థలమున హ్యాంలెటుప్రవేశించెను. పాలో నియసుక్లాడియసులు తెఱమఱుఁగున నోరులుదాకలుచేసికొని డాఁగియుండిరి. కొంతసేపువఱకును, హ్యాంలెటు, ఆమెను గన్నెత్తియైనను జూడలేదు. నరాగియయి, పండనిబయిరాగి వలె, పేదరాసిపెద్దమ్మవలె, పెద్దమ్మకాదు, పెద్దన్నవలె, పేదరాసి పెద్దన్నవలె యేమేమియో, తనలోతానే, యనుకొన సాగెను. ఏకాంతవర్తి. హస్తవిన్యస్తగండస్థలుఁడు తలపోఁత లీరీతి. తీరిది. విచారము దీర్ఘము.

ఉండనా, ఊడనా ? ఏమిగతి ? అటో, ఇటో, ఎటో, తేల్చుకోవలెను. లక్ష్మియున్నదే, ఆమె మహాయిల్లాలు. మానసమున నవనీతమేసరి. అయిననేమి ? లక్ష్మిపుత్త్రులు వజ్రకాఠిన్యహృదయులు. వీరిచేఁబడలేక బడుగులమయి యున్నాము. కోసినను దయలేదు. కంచుకాగడావేసి వెదకి

-సను దాక్షిణ్యములేదు. నారిచేఁ జెంపపెట్లు, బుగ్గనులుములు, పడిపడి కాయలుకాసినవి. కడుములుకట్టినవి. చేతులు జోడించుకొని, నమోనారాయణా, నమోవిశ్వసృజే, అని, నాకర్మమని, నుదుటవ్రాసినవ్రాలని, యనుభవించుటయేనా కర్తవ్యము ? కష్టసముద్రముమీఁదఁ గిత్తులుదూసి, కట్టకడపట ప్రాణము నిక్కడకు ముక్తాయింపుచేయుట మంచిదియా ? ఏదియుత్తమము ? ఏదిదొడ్డబుద్ధి ? చస్తాము, అయ్యా— అంటే, నిద్రపోతాము, అయ్యా; అంటే, అంతకన్న యెక్కువ, లేదు. తక్కువయు, లేదు—ఇదిగో, ఆనిద్రవల్ల, యీతలనొప్పి, ఆకడుపుమంట, యీగుండెదడ, ఆమాంసపోటు, యింకనెన్నెన్నిప్రక్కపోట్లు, తాకిడులు, ఈమాంసపుముద్ద, బొమికలపుట్ట, యీయవతారముపాలిటిసొమ్ము, యుగ్గుపాలనుంచి కూడ యబ్బియున్నవే ? ఇవియన్నియును, యీగాఢనిద్రలో వెళ్లిపోతవి, అనిన నింకేమికావలసియున్నది ? ధన్యోస్మి. అయ్యా, చాలు, చాలు, బ్రదుకుతెల్లవారినట్లేను. ఆగు, ఆగు, ఆగవయ్యా, చస్తే—నిద్రపోతే, నిద్రపోతే, కలవస్తుందో యేమో; కలవస్తే మనసుకలుక్కుమంటుంది. మనము ఉక్కుతునుకలమా ? తుమ్మతుండ్లమా ? ఉండు. అక్కడనే యున్నది ప్రాడ్డు, సామాన్యజనమునకు చవిటిగుల్ల. భాగ్యవంతులకు రాచపుండు. అక్కడనేయున్నది రోగము. అక్కడనేయున్నది కుళ్లు. అక్కడనేయున్నది నళ్లు. అక్కడనే వచ్చిపడ్డది గాండీవము. అక్కడనేయున్నది విరపనకొయ్య. చెరపనచేట. ఏమిచేయుదుము ? నిద్ర, అనుకో, చావు, అనుకో, మగత, అనుకో, ఏమనుకుంటావో, అనుకో. ఈ

బొందికిఁ జైతన్యము తప్పిన వెనుక, యేస్వప్నములు వెంబడించునో! ఇదియొక్కటియే, తాళు, తాళు, ఆగు, ఆగు, అనిఅంటుంది. ఇందులకేగదా, ఏడ్చుచు, మూల్గుచు, నేఁడ్లుపూండ్లు గడపుదుము. లేనియెడల ఎందులకయ్యా ఎవఁడుపడుతాడు, అయ్యా, యీతిప్పలు, చెళ్లు, చెళ్లనఁగాలానుసారముగ, దానికడుపుకాల, కలికాలమహిమనుబట్టి, తగులుదెబ్బలు, తాకిడులు గర్విష్టిపడు,అదిరిపాట్లు, ట్టుపాట్లు అధికారపూరితమదాంధునిపొగరు. తెంపుతెని, తెగితెగని న్యాయకూటముల, కూటస్థులతీర్పులు; కష్టమొకచోట, అనుభవమింకొకచోట, పలుగాకికిఁ గట్టఁబెట్టు మడిమాన్యములు, కష్టికిమంగలము, కాయుచెట్టుకు ఱాళ్లవర్షము, ఋవియన్నియును, యీపడరానిపాట్లన్నియును, ఎంఁదుకిపడ్యాపడుట ? ఈకెనుదీసికొని యొక్కపోటున, బొడుచుకుంటే, విడుదలరాదా ? ముక్తిరాదా ? ముక్తేశ్వరమువేతే యెక్కడయుంటును ? ఎప్పుడును సదా తాపేశ్వరమేనా ? తాపేశ్వరముదాఁటిన ముక్తేశ్వరము. ముక్తేశ్వరముదాఁటిన, శనేశ్వరముదాఁటినట్టేను. జంబుకేశ్వరము, మాయవరము లంతకుఁబూర్వమే దాఁటిపోయినవి. కాని యొకపోటందుముగాని, పోటుఅంటే, మాటలతోనుండునా ? నోటిమాట, అనుకుంటివా ? తెలివియేమైన తక్కువయనుకుంటివా ? లోటు, అనుకుంటివా ? ముచ్చెమటలుపట్టి, పట్టించుకొని, గాడిదబరువులు మోయుచు, పందివలె మొక్కుచు, అష్టకష్టములుపడుచు,ఎందుకయ్యా, యీరోజులు రోజుచు నీడ్చుట ? చచ్చిగతరువాత, గిట్టినతరువాత, కలుగుననుకొను, యేదియోనొకయెదురు, యేదియోనొకజంకు, కాని దేశమే,

చూడనొక్కచుట్టము, మ్రొక్కనొక్క దైవము, ఉండునో, ఉండఁడో. అక్కడకునిక్కడకు రాకపోకలునున్న. గుండుసున్న. అక్కడకబు రిక్కడకులేదు. ఇక్కడకబు రక్కడకు లేదు. ఇదియేమనల పాటలనాడించి, పాటలను బాడించుచున్నది. అక్కడకుబోవుట యెందుకయ్యా, తెలియునిచోటు క్రొత్తదయ్యము లేమిచుట్టుకొనునో. ఉన్నదయ్యములతో, నిక్కడనే వేగుదము. అఘోరింతము. గుండె నిబ్బరముగ నిలువదుగదా. పిటికితనమెక్కువపాలు గారుచున్నది. గోక్షీరమనినమ్మఁజెప్పుగొల్లసైతము, నీరు, తుదకు,దోసపాలునయినను గలుపునగాని, ఈపిటికితనముపాలు కల్తిలేనిపాలు, ఏమేమియోచెప్పు పెద్దకబురులు, గదిద్వారబంధముదాఁటవు కోటబురుజులుదాటవు. మీనము, మేషము, అనిపడిచత్తుము. ఏమేమోనిర్వాహకముచేయుద మనుకొందము. అందువల్ల మనతో సమానములేరందుము. అనుకొందుము. చేయఁబోవుసరికిఁజెయి మడతపడును. చేఁత దూసికొనిపోవును. క్రియాశూన్యము. శూన్యతిథి. అధికమాసము. నిజము రానేరాదు. నిజమువచ్చిన బ్రతికియేపోదుము.

హృంలెటుమనసున నొకరామరామణాయుద్ధము ప్రారంభమయినది. ఈవిధమగుసమస్యలు పరిపరివిధముల బంధింపఁజొచ్చెను. బాధింపసాఁగెను. పరధ్యానముగనుండి, యిటు తలయెత్తగనే ఒఫీలియావసారాలో, పచారిచేయుచుఁ గనుపడినది. ఆమెది యర్జునసన్న్యాసమువంటిది. పురుషయోగము. మన్మథహారము. బకజపము. ఏదియోగ్రంథమును, మహాచదువు సదుకునట్లు తలవంపుకొని, హంసనడకలు, ఎగు

వచూప్రులు, నడుచుచున్నది. ఏమి; ఒఫీలియాసుందరమ్మా, అని యాశ్చర్యముగ హ్యాంలెటు, అఱచెను. తనమనోబాంధ వియగు నామెయెడలఁగూడ తనచిత్రవిభ్రమకుబునము దాల్చు ట కడుసమంజసమని తలంచి, పదములు మొదలుపెట్టెను. మువ్వగోపాలపదములా? గవ్వకును, రువ్వకునుగూడ కొఱ గాని, జీలుగుబెండుపలుకులు. దేవీ! యేదియో నోకజపము చేయునట్లున్నావు. నా పాపములను బరిహరింపుము, హరింపుము.

(పరితపించుచు, తపించిపోవుచు) కుమారశ్రీతీశా! దేవ రవారుకుశలమా? అని యడిగెను. ముక్కుమొగమెఱుఁగని వేషము, పరాయిపురుషునివలె నభినందించి, బాగున్నాను, బాగున్నాను, బాగున్నాను, అని మూఁడుచినుకులు. ఇంతకుఁ భూర్వమే, తనయనుజన్మఁడిచ్చిన మందలింపుజ్ఞాపకమునకు దిగినది. రాజకుమారుల మన్మథోద్దీపనము లింపులుగాని, నింపవు. నిలుకడలేదు. క్షణక్షణభంగురము లు. అని నాయ న్న చెప్పిరే? అక్షరములా? నిజమయినవే? శిలాక్షరములయి నవే? తామ్రశాసనములమీఁదఁ జెక్కినయక్షరములవతు యయినవే? రోళ్లారోకండ్లంబాడిన కూర్మలకీగతిపట్టినదే? అనుకొనుచుఁ, దనయొడిలోనుండియు త్తరములకట్టను, నగల మూటనుదీసి, హ్యాంలెటుకుజూపించి మాప్రభూ! చిరకాలము నుంచి తమవితమకు, తిరిగివప్పగింప వలయునని తలంచుచుం టిని. నేటికిసమకూరినది. స్వీకరింపుఁడు! హ్యాంలెటు, ఆమె నొక్కవిదిలింపు విదిలించినాఁడు. నేనుకాదు. స్వప్నేపి నేను కాదు. నేనేమియును నీకియ్యలేదు. ఇచ్చినట్టుమీకుఁ బూర్తి

గఁ దెలియును. అంతియకాదు. వానితోడుత, వెలయిడరాని కమ్మకప్పురపుఁబలుకులు వస్తువులకు విలువను హెచ్చించెను. ఇప్పుడాబులబాటము తగ్గినది. కనుక, వీటినిపునః స్వీకరింపఁడు. ఆమెయనినమాటలు, హ్యాంలెటుమనసున కొకదిట్టమగు కుదుపునిచ్చియుండవచ్చును. మనిషిలోలోన నఱకుకొనిపోయినాఁడు. అట్లుకనుపించినయడల పెనుప్రమాదము వాటిల్లును. చిత్రవిభ్రమముపుట్టఁగఁ బర్వదినమునాఁటి సముద్రముపొంగువలె, కనుబఱచవలెను. ఒఫీలియామీఁది ఋణానుబంధము. ప్రేమానుబంధమును, సడలనిచ్చి, పూర్ణముగనశించినట్లుగాని ఆమెను మఱచినట్లు, కనఁబడుటకు దృఢముగ నిశ్చయించుకొనెను. ఆమె శ్రేయస్సునకుఁదగుపని, హ్యాంలెటును మఱచిపోవలెను. మఱియొకరిని ముడిపెట్టుకోవలెను. లేదా, యింకను, మంచిపని, మంచిది. బంగారువంటిపని. దేనితోడను, సాటిలేనిది. యోగినులమఠమునఁ గాలుపెట్టి, యువలోకము వారు వారి కులుకునడలఁ దామేనలకూబరులో యనుకొను యువజనముల, కుట్రతొత్తుకొడుకుల దుర్నడతలకుఁ గాపుదారీచేసికొనవచ్చును. ఇంకను, యేమేమియో మాట్లాడెను. ఎన్నఁడోయొకసారి యతఁడామెను గామించియుండవచ్చును. ఆమెను నమ్మియుండరాదు. ఇప్పుడావలపు, వలపులపంట యేమైనదియో, అందులకేగదా తాను మోసపోయితినని, ఒఫీలియా మాఱుచెప్పినది.

“ఉ. శౌర్యమయుం డతండు భుజసత్వనిధానము కాంతిరాశి
గాం ।ధైర్యపుఁబ్రోక సత్కళల పెన్గని రూపము దాల్చినట్టి
యా ।దార్యము పెక్కులేటికినుదాత్తగుణోదయ మాయ

పూర్వసౌం । దశ్యత కెంత యెంత యుచితం బహు సంత
యుగల్గి శోభి (లె) ౯"

మఱికొంతసేపటికి—, అంతటి స్వకీయవిలాసముగాఁడు గంటె, అటువంటి హేమాహేమీ. బంగారుతునక, వజ్రంపు రవ, కర్మముకాలిపోయినట్టు, అయినదే, ఏమి భ్రాంతిరొత్తె నో కో, యేలో కో, అని యవ్వుడుగ అచెను. హ్యాంలెటుముఖ వైఖరినిఁజూచి నివ్వెఱపడి మనస్థైర్యంబునిలుపఁజాలక, ఉన్మాదుఁడే, భ్రాంతిగనున్నాఁడుఁడే, పూర్తిగనున్నాఁడుఁడే, అని ప్రలాప పడుచుకొనినది. తానొక మనుజుఁడుగనుండి, లోకములోని యందఱిమనుజుల నడ్డగాడిదలనియు, అడ్డగాడిదలనియు, నోటికివచ్చినట్లు, అనరాని యవాచకములఁబట్లను దిట్టుచున్నాఁడు. మమ్ములనెవ్వరిని నమ్మవద్దు.

"చ. మలఁకలు మాపచారములు
మాముఖముల్ విషవహ్ని ఘోరముల్,
ఖలులము రోషజాతులము
గర్వులమే యొకమంచివారమే ?"

అనియు, తానతిగర్విష్ఠియనియు, పాపిష్ఠియనియు, ఆశాపాతకుఁడనియు, దుర్వృత్తిపరుఁడనియు, కోపినను, నిలువని స్వరము, నిజాయతిలేదనియు, మాటలకు లంగరంచని, మనోకాలుష్యముగలవాఁడనియు, కాలపరిమితినిమించిన దుండగములరాయఁడనియు, ఛంకామీఁదదెబ్బకొట్టి ప్రగల్భింప సాఁగెను. ఎందులకయ్యా, తనవంటి, నిరక్షర, నిరక్షరకుక్షులు కుక్షింభరులు, తండ్రికడుపుఁజేటుమై బుట్టినవారు, భూమికి

నాశనమున కూగినలాడుటవలన నేమిసార్థకము ? ఉన్నట్టుగ నుండి మాటకట్టిపెట్టెను. నోటికిఁదాళము వేసెను. ఒఫీలియా చుట్టుతిరిగి, తెలవెళ్ళయుబుకునగాంచి, అనుమానగ్రస్తుఁడై "మీనాయన యేడ ? అనియడిగెను. తనతండ్రి యిందుదాఁగి యుండువార్త యామెకుఁ దెలియనే తెలియునందున, అమాయి కత్వముతో 'ఇంటివద్ద' అనిచెప్పినది. అతనిని యింటినుంచి బయటకెక్కడకు నడుగుపెట్టనియ్యకండి. వెఱ్ఱిముఱ్ఱిచేష్టలు తనయింటనే, చేసికొనును. ఇఁకచాలు, నీవునడువు. అని ఒఫీలియాతోననెను. ఆమెకు మనసుననున్న యనుమానము పూర్తిగ హెచ్చినది. మతిపోయినమాట వాస్తవము. చూచి శోషిలినది. ఓ దేవతలారా ! మీమీచేతనైనయెడల నడ్డు పడుఁడు. రారే, కరుణింపరే, కావరే, నాహేమాహేమీని, నానిధిని, నాయిలవేల్పును. ఆయన వెడలిపోవుచు గిరుక్కునఁ దిరిగి, నీవుమఠమునకుఁబొమ్ము. నేఁజెప్పుయీమాట నీచెవుల కెక్కనిపక్షమున, నీవుపెళ్లియాడుదువు, అనుకొనుపక్షమున, నీకీ అపవాదమును కట్టఁబెట్టుదును విను. మంచుగడ్డవలె, నిర్మాలిన్యముగనున్నను, మంచుదొంతరలవలె మకిలిలేక యున్నను, నీనడవడిమీఁద నడివడిగ నభాండములు వేయునే వేయుదురు: నింద నలుమూలలను మోపుదురు. అన్చుదురు. సవారిచేయుదురు. కాఁబట్టి, మఠమునకుఁబోవమ్మా, నా ముద్దుగుమ్మా. ఇంకను, నాయీమాటలు పెడచెవినిఁబెట్టు టకుఁ జొలుచున్నయెడల, నీగంతకుఁదగినబొంతను గట్టు కొనుము. మీరుపెట్టుపాట్లుపడలేక, బుద్ధియేమాత్రమున్నను మగవారు పెండ్లికిదిగరు. నేనుజెప్పినది చక్కఁగ నాలోచిం

చుకొనుము. మతమునకే వెళ్లుము. వెంటనే వెళ్లుము. తప్ప వద్దు. శలవు.

ఒఫీలియామాత్రము హ్యాంలెటుస్వస్థచిత్తతకు దేవతలను బహుప్రార్థించినది. అతఁడికి, ఒఫీలియా యెవరో, తానెవరో, తనతల్లిమీఁద ధ్యానముపారి మనోవేదన మిక్కుటముగాఁజేసెను. అఁదుది, అంటే రోఁతయయిపోయినది. కనురోశిపోయినాఁడు. పరిపరివిధములఁ బరిభ్రమించి, ఆతనినునను, అల, ఒఫీలియామీఁద విఱుచుకొనిపడి "నీమొగము మెఱుఁగులు, పూఁతలు విషయముకూడ విన్నాఁడను. చాల విన్నాఁడను. దైవమిచ్చిన మొగమొకటి. మీరు తెచ్చిపెట్టుకొను మొగము మఱియొకటి. నాప్రాణమువిసికివేసారిపోయినది. నాకుఁబిచ్చియెత్తినది. ఇఁక నూతనవివాహములు వలదు. ఇదివఱకుఁ బెండ్లియాడినవారిలో నొక్కరుతప్ప మిగతయుండఱును బ్రదుకుదురు. మిగతా, అందఱును స్థిరోభవయని యుండిపోదురు. నీవుమాత్రము మఠమునకుసాఁగిపో.

ఇదిసాంతముగవిని, ఒఫీలియా యేడ్చినది. ఏడ్చినదియునిన నాశ్చర్యమేమి ? ఏడువదా ? ఏమువకచేయునదియేమి? మల్లెపువ్వువలె ప్రపోఢిరహితమయి స్వభావసౌందర్యముగల యామెముఖము, నిర్మలమయిన యామెయాత్మ శుద్ధస్ఫటికమువలె నమాయకత్వము,యిట్టియుత్తమగుణములామెయందు పుంజీభవించి, ఘనీభవించి, మూర్తీభవించి, తాండవమాడినప్పుడు, కంటఁదడిపెట్టుకొనక యిన్నకుండఁగలదా ? హ్యాంలెటుపలికిన పలుకులకు, చినికిన వాక్సుధచినుకులకు, చూపినయదలింపులకు, యూపినవిదలింపులకు, విచారముతప్ప

యింకొక రాగమునహా. అంతేయు నాలుగొక్క రాగము. దానిలోనే యెక్కుడలేనిమహిమ. మధురిమ; మాధురీమహిమ; అతులితమాధురీమహిమ. అలసానిపెద్దన్న యిటునటు దొడ్డిచ్చినాఁడు; దోషించినాఁడు. భట్టుమూర్తిబావురమని యేడ్చినాఁడు. దోషించినాఁడు. ముక్కుతిమ్మన ముద్దుముద్దుగ నేడ్చినాఁడు; దోషించినాఁడు మఱి మన ఒక్కలియాయెడ్పి పీకితన్నిటినతిరస్కరించినది, ధిక్కరించినది.

హేమ్లెటు, అటుసాగిపోవుచుండఁగా; 'ఎటువంటి ఘనుఁడు కూలిపోయినాఁడు' అని వగవ నారంభించినది. నేను జూచినది చూడవలసివచ్చినదిగదా. వినినది వినవలసి వచ్చినదిగా! నేనెంతటి పాపిష్ఠిదానను! నావెంతటి పాపిష్ఠికనులు! కటకటా! శోకరహితముగ డెలు యొక్క వైపునకుఁ గదలినది. క్లాడియసు, పోలోనియసులు గుసగుసలు. ఇవి మన్మథవిచేష్టితములుగావు. అనిగుండెబరువుతో, గుండెదిగులుతో, గుండెదడతో క్లాడియసు, మఱియేదియాలోచనగఁ బాధకొని యున్నది. పోలోనియసుకు మనసుగుదట్టలేదు. ప్రమాదము కాకమానదు. విషమించకమానదు. దోషించకమానదు. మనమీతనివెంటనే, ఇంగ్లండునకుఁ గప్పముగొనితేర, మిషపెట్టి పంపుదము. దేశదేశములు, సాగరసాగరములు సందర్శనమితని హృదయశోకముఁబుచ్చివైచును. నీయభిప్రాయమేమి? అనిపోలోనియసును వేడుకకడుగుటయేకాని, ఇంతకుఁబూర్వమే, యేయుపాయమువలననైన, నీకొలిమిని వదల్చుకొనవలయుననియు, నాంగ్లదీవికానవలయుననియు, క్లాడియసు, సునిశ్చితుఁడగుచే యుండెను. పోలోనియసుమాత్రము పాత్రికుఁడువలె

చేయుము రా! అనియడిగినాఁడు. అందులోఁ దానొక 12 పం క్తులువ్రాసి యిత్తుననెను. దానికి వారియ్యకొనిరి. ఆలుమరు నటిరాత్రి. రాజుగారు, రాణిగారు, రాజాస్థానసభాసదులు యావన్మందియుఁ బ్రేక్షకులు.

హారేషియో Horatio యిప్పుడు కనఁబడిన బా గుండును. అనియనుకొనినాఁడు. నాహృద్గతి నాతనికి విప్పవల యును. సంకల్పమగుసరికి హారేషియోప్రత్యక్షుఁడు. అత నిని బిలిచి, నీకు నాలో శ్లాఘ్యస్థానమున్నది. తగినసమయ మునకుఁ జేరుకున్నావు. నిన్ను ముఖస్తుతి చేయుచుంటినని తలఁచుచున్నావో యేమో; నిన్ను నీమొగముముందటను బొగడిన నాకేమిలాభము? నీయొద్ద ధనము కుప్పలుకుప్పలుగ నున్నదా? ఏమి? మంచితనము. దొడ్డబుద్ధిమాత్రము కావ లసినంత మూర్తీభవించియున్నది. నిర్ధనికునియెందుకు మం చినిఁ బొగడిన నేమిసార్థకము? స్తుతిపరాయణులు, స్తుతిపాఠా యణులు చెలరేగియే యున్నారు. ఎక్కడిగుమ్మము, దిగడి గుమ్మము, నోటనమృతము; అంగుబనమృశము. నాభియం తయు వసనాభి. ఐశ్వర్యవంతులవాకిటను గజ్జలుకట్టుకొని, యాటలాడనిమ్ము. మణుమువంచి, మోకాళ్లువంచి, పనుపా టులకు, పాదుపాటలకు, బంగారుచిన్నములు బొడ్డునఁ గట్టు కొందురుగాక! చిన్నములు బరువెక్కినకొలఁదియును రాజ మాన్యారులగుదురుగాక!

నేఁజెప్పుమాట నీవువినుము. నాప్రాణముపేళయప్పు డు, నిన్ను జేపట్టినదిరో, యావేళావిశేష మెట్టిదిరో, మను ష్యుల: గుణాగుణములు వ్యత్యాసములను పిడమర్చి, గుత్తపటు

తెలివి నామనసున నంకురించిన యప్పటినుండియును, నిన్ను నేను నాకాణాచి యనుకున్నాను. ముద్రాంకితము చేసికొని నాఁడను. నాబొందెకుఁ గట్టివేసికొనినాఁడను. నీవు బహు కష్టజీవివి. అయినను, మనస్సునకు మాత్ర మిసుమంతయైనను గొఱంతయైన నంటించుకొనవు. పట్టుశ్రీమంతులు పెట్టు, చేయు సామంతములు బహూకరణములకును, దుల్యభోగివి; తుల్యభాగివి. నిరుపమభోగివి. ధనికులాడుమాటలసన్నిఁటికిని దాళము వేయక, తమబుద్ధికుశలత నుపయోగించుచు నను రాగాన్వితులు కానివారు మహానుభావులు, కడుధన్యులు. రాగద్వేషాదులకుఁ బట్టువడని చిక్కువడని, దాసానుదాసుఁ డు కాని, మనుజుని నాకిమ్ము. అయినను, నానేత్రమిూఁదఁ బెట్టుకుందును. శిరసా వహింతును. నాతలమానికముగ ధరిం చెదను. ఇప్పుడు నేను నిన్నుఁ జేయురీతిని—గుణైకనిధివి. నాకు దక్షిణభుజంబవు. బహిఃప్రాణంబవు.

మానసములు కట్టి, యింద్రియములమదము లడఁచిన వారీ నెచ్చెలులు. నెఱనింపు నెచ్చెలులు; అచ్చపుఁజెలికాం డ్రు. ఈహ్యాంలెటు, హూరేషియోలకలయికలు బంగారు పెలిగారములే. ఇనుము సూదంటురాయిలే. మమేకము. ఇద్దఱిమనస్సులును, గుండెలును బెనవేసికొనినవి. రెండుతలలో నాఁడు నాలుకయొక్కటియే. రెండుపుత్తిలలోఁబుట్టు తలఁపులు కవలలే, అట్టి, యీహూరేషియోకు, యిట్టి యాహ్యాంలెటు తనమనస్సున ; ఆటవిచ్చినాఁడు. ఆటసేయునపుడు, రాజుగారి మొగమునే బహుమెళకువతోఁ గనిపెట్టియుండవలయుననియు నెందుకనఁగా, నొకరంగమున నాఁడు, తోఁటలో జరగినదని

రోగము రాలేదే? గొప్పవారిస్మరణము, వారి మరణానంతర మాఱు నెలలుండునుగదా. ఇట్లనుకొనుచుండఁగనే వ్రిదర్శ కులు వచ్చిరి. ఆటనువేసినారు. గంజాగో (Gonzalo) అను సంస్థానాధిపతి; అతఁడికళత్రము బ్యాప్టిస్టా (Baptista)యును నిగాఢప్రేమఁ దలిర్చుదంపతులు. అందులో బ్యాప్టిస్టా; తనభర్తయెడల ప్రేమ, యింతయంత యనిచెప్పనలవికాదని యును, దానెప్పుడైనను, బునఃపరిణయమునయినయెడల, తన మీఁద నొట్టుయనెను. హ్యాంలెటుతల్లికూడ నిదేరీతిగ తరుచు గఁ బలికెడిది. ఆమెవైపునకుఁదిరిగి, నాటకమేమంటున్నది? అనెను. అతిభారముతోఁ గథానాయకురాలు త్తవదరుబోతు, అనినది. అయిననగుగాక! ఆమె యాడినమాట తప్పదు. మాటనిలుపుకొనును. అనిహ్యాంలెటు. క్లాడియసు, ఆటను వింటివా? కంటివా? అనిభార్యను, యిందులోఁ దప్పుపట్టవల సినది యేదియును లేదుగదా, అనెను. హ్యాంలెటు, యీ మాటకందుకొని, లేదు, లేదు, వాండ్రుపరిహాసముగ నను చున్నారు. ఎగతాళిలోవిషము. లోకములోఁ దప్పెక్కడ యున్నది? అనిపినతండ్రికి నమ్రఁజెప్పెను. ఈనాటకము పేరేమి? అని క్లాడియసు, అడిగిన 'ఎలుకబోను' అని సభా స్థానముయొక్క నలుదిక్కులు వినఁబడునంతబిగ్గరగ నెలుగెత్తి యఱచెను. వియన్నా (Vienna)లో జరగియున్న యొకఖూనీ, యీనాటకమునఁ బ్రదర్శింపఁబడినది. నాయకునిపేరు గం జాగో, భార్యబాప్టిస్టా. ఇంకను జాలచూతురు. బహుతేలివి తేటలకోడ వ్రాసినారు. అంతకుమించిన చాకచక్యముతో నాడుదురు. అయినమాత్రమేమి? దేవరవారు మహారాజులు;

శ్రీమంతులు, సామంతప్రభువులు. సర్వస్వతంత్రులు. స్వేచ్ఛావిహారులు. మనకంటదు. అంటుకొనదు. అనుకొన్నవారను కొనవచ్చును. మనవంటి నీగకూడ వారిలేదు.

ఒఫీలియా వైపునకుఁదిరిగి యావచ్చువేషము లూసియానసు (Lucianus) కథానాయకుని మేనల్లుఁడు. ఆట మారంభముతిరిగి శ్రోత్రరంగము. క్లాడియసుబొడ్డు పొక్కుఁచున్నది. అతఁడిదివఱకుఁ జేసిన ఘోరమిందు ప్రతిబింబించుచుండఁగా, హ్యాంలెటు మైమఱచి, పొక్కు-చప్పటలుచఱచ నారంభించెను. అతఁడి కనుగ్రుడ్లన్నియును, భ్రాతృఘాతకుఁడగు క్లాడియసుమీఁదనే పెట్టుకొనెను. రాజ్యముకొఱకుద్యానవనమున నాతనికివిషము పెట్టుచున్నాఁడు. అతనిపేరు ఆదురదృష్టవంతుని పేరు గంజాగో. ఈకథ యతివిఫులముగ, నతిచక్కని మధురశైలిని, ప్రాశ్చాత్యఖండముభాషల మన మాతృభాష 'తెనుఁగు—తేట' వంటిభాష, ఇటాలియన్ భాషలోఁ వ్రాయఁబడినది. మీరుత్వరలోనే, చూతురుగా! ఈహంతకుఁడు లూసిఢూనస్, గంజాగో భార్యయొక్క ప్రేమను గొల్లగొనును. ఇప్పటికి క్లాడియసుబొడ్డు పొక్కినది. సున్నముకొత్తది. ఘూటువుా రిగనున్నది. క్లాడియసు పెుఁకనునిలువ భరించలేకపోయినాఁడు. బెదురుతోను, రోషముతోను, కాళ్లుద్ఘూడించుకొనుచు లేచి, లాంతరులు వెలిఁగించమనెను. ఆనువెంటనే వెళ్లవలెను. వంట్లో సుస్తీగానున్నది ఆట, ఆపండి అని పోలోనియసు కేకలు. రాణియును, దాచ పరివారమును, రాజాగ్రాణి, పడకగదిలోనికిఁ బట్టుకొని చేర్చిరి. హ్యాంలెటు తన ప్రాణసఖునిదొగ్గరకు వెల్లి ఘంటా

పధముగ, భూతముయొక్క మాటలు అనువరహాలుచేస్తవి. వేదశాస్త్రముగ నేనునమ్ముదును. విషముపెట్టు గాథవచ్చినప్పుడు? రాజకుమారా! నేను చక్కగ గమనించితిని; అని హోరేషియో. ఈసమయమున నిద్దఱుచిన్నవయస్కులు, రాజసభాసదులు రోజెన్ క్రాంజ్ (Rosencrantz) గిల్డెన్ స్టెర్న్ (Guildenstern) లు, ఉన్మత్తుఁడు హ్యాంలెటును వెంబడించుటకు, క్లాడియసువల్ల పనుపఁబడిరి. అతఁడియొద్దకువచ్చి రాజుగారు మండిపడుచున్నారనిరి. రోగపీడితులైరని. వీరివేషభాషలు చూడచూడ హ్యాంలెటుకు ధుసుధుసు. మీరు చాలబుద్ధిమంతులు. మీమీబుద్ధికుశలతలకుఁ సరిగా వైద్యునియొద్దకుఁబోయిన బాగుండును. నాపోవుగు రోగము గిట్టదు. రోగమ్మింకను హెచ్చుపెరుగును. గిల్డెన్ స్టెర్న్, యించుక కోపము తెప్పించుకొనినట్లు యిట్లంవి, మీనవాళ్లనోక మూలవైచి, నాచెప్పువిషయముమంచి వినుఱకుఁడు. హ్యాంలెటు తనధోరణిని తానువిడువక, అందుకొని నేనుసాధుఁడను నాను. ఈపంధాతప్పించి, రాణిగారు, మీజననీ, దుఃఖాక్రాంతయయి మీయొద్దకుఁబంపినారు. ధూర్తవినయముతో, మీకుభ్యంతరమేమి? అనిహ్యాంలెటు. గిల్డెన్ స్టెర్న్ యీ జవాబుకు విసుకుజెంది, పెదవికొఱికి యీమర్యాదలు సవ్యమయినవికావు. మందిపలుకు, జవాబు, మీతల్లిగారికిఁ జెప్పితిరా సరే, లేనియడల నన్నుక్షమించుడి. నేను మళ్లి మొగమును బట్టుమును. వచ్చినకార్యము సాంతమయినది. అయ్యా, నేనురాలేను, అని హ్యాంలెటు ముక్తసరుగఁజెప్పెను. హ్యాంలెటు మాటలసందునఁ తనప్రశ్నను మఱచిపోయి గిల్డెన్

స్పైర్ను శౌక్తిముగమువైచి 'ఏమి, అనినారు' అని యనెను. మీరు బహుమంచి జవాబక్కడ చెప్పండి, అని రాజకుమారుం డనెను. నాకుమతిలేదు. కాని చెప్పేజవాబు, ఆజ్ఞయే, 'మాయమ్మ' అని యేదియో ననుచున్నారు.

మాయమ్మ, యేమంటారు? హ్యాంలెటు ముఖవిలాసముచూడంగా, రోజెన్ క్రాంజ్ గడగడలాడినాండు. మసిపూసి మారేడుకాయచేయుటకు యత్నించెను. మాసికవేయుదొరకొనెను. పట్టపుదేవిగారు, మీవాలకమును జూచి యద్భుతపడినారు అని అనినాండు. ఓహో! ఎంతటివింతపుత్త్రుండు! జనయిత్రికి దిగ్భ్రాంతిపుట్టించువాండు. దీనికుత్తరకాండ యుండకపోదు. శెలవిండు. అనిహ్యాంలెట. మీరు పడకపాన్పుకుం బోవకమునుపు, మీతోడ ముచ్చటించవలెనంట. అని గుటకలువేయుపారంభించెను. విధేయతకేమి భాగ్యము? కావలసినంతవిధేయత. నాతోనింకను, యేమిపనియున్నది? అని కోపముతో నాయిద్దఱిరాయభారులను హ్యాంలెటు, అడిగెను. గోజన్ క్రాంజ్ చేతులు పిసుకుకొనుచు, నేననినబహు, ఆపేక్షగనుండెడివారు. నామీఁదశీతకన్ను వేసినారు. దయతప్పినారు.

మించా యిప్పుడా గ్రహించినాండు. హ్యాంలెటుకు, ఆప్తవర్గములోనివాండనియే, క్లాడియసు, యీతనిని హ్యాంలెటు మనసులోని యుమ్మలికమునకుగల కారణము పెల్లగించుకొనిరమ్మని పంపెను. ఆవలించినం బ్రేపులులెక్కించు చండశాసనుండు హ్యాంలెటు. ఓడు నిమిషములోం గనిపెట్టినాండు. తుపాకారకములో, చెప్పుడుమాత్రము ప్రేమించకపోయెను? ఉంచిది యీమాటలకేమిగాని, మీమనసుకలకకుం

గారణమేమి ? అని మొఱటనడిగెను. మీకష్టసుఖములు, మీస్నేహితునకార విప్పకపోయినయెడల, మీస్వాధీనతకు స్వాతంత్ర్యమునకు భంగము వాటిల్లకుండునా ?

అయ్యా, నాకాలోచన పాలుపోవకయున్నది. (లోలో నఁదనతండ్రి హంతకుని హతమార్చుటకుఁ దెన్నుగానక) అని మారుపల్కెను. రాజపదవి తప్పినందులకు విజ్ఞానగ నుండెనని, రోజంక్రాంజు భ్రమపడి 'మీకందుకాదిగులు' రాజుగారే స్వయముగ నిమ్ములను జేర్చుకొనినప్పుడు ? నిజమేకాని, గడ్డి మొలవదూ ? మొలచుచుండినయెడల? ద్వారణితప్పించి, తమా యిరువురు రాజాశ్రయుల ముఖావలోకనము గావించి, ఎట్టి తుచ్ఛులుమీరు? నామనసులోఁతు మీతరమా గనుగొనుట? నాచేత నవాకులు, చవాకులు వాగించవలయునని తలంచితి రిగా ! నాలోలోన నణఁగియున్న, మాటుమణఁగియున్న, చింతనుబట్టుకొని, యాగిసలాడవలయునని తలంచితిరిగా ! ఏమియాదిట్టరితనము ! మీరే గడుసువాండ్రమని తలంతు రుగా ! నామీఁద సవారీచేయువలయునని తలంచితిరిగా ! మీయుపాయములకు నేనువంగెడివాఁడఁగాను. బాగుగఁదెలిసికొ నుఁడు. తేలిపోయి, పాలిపోయి, వాడిపోయి, వత్తులయిపోయి, నెత్తిమీఁద నుగుడ్డవేసికొని, భగ్నమనోరథులఁయి, రాజాసన్ని ధికిఁజేరఁకొనిరి. హ్యాంలెటువధ కుపక్రమణములకుఁ బనిపూ నిరి. పైపూఁతలెన్ని హెత్తుచున్నను, ఆండలువేయుచున్నను, అసలువారి యంతర్నాడులు, దడదడ కొట్టుకొనుచునే యు న్నవి. అల్లాగే, ఆకులనుమేసి మేఁకలనుగాయుచున్నవి. నలు గురిమధ్య నున్నప్పుడు, యేమోమనుష్యులవలె తిరుగుదురు.

వంటరిగ నుండునప్పుడు, వారియవస్థ పగవానికైనను వద్దు. క్లాడియసుయొక్క యీయఘోరింపు నాలకించియే తీరవలయును. 'అయ్యో! నానేరమెంతటి పాపిష్ఠిది. నాపాపమెంతటి ఘోరకలిది. పరలోకమునఱకును గవులువాసన గొట్టుచున్నది. అనాదినుండియును బెట్టినశాపము; ఘట్టినశాపము. అన్నదమ్ముల శత్రుత్వము. ఇక్కడ శత్రుత్వముతోడ ముగియలేదు. హననమునకు శాపముపండినది. ఏమొగము పెట్టుకొని నేను బ్రార్థనచేయఁగలను? చేయవలయునని కావలసినంత ఇష్టమున్నది. మనస్సున్నది. చేసినమహాపాతకమువలన నాకు మొగముచెల్లకయున్నది. రెండుపనులు జరుగవలసియున్నవి. ప్రారంభమెక్కడనుంచి? ఈయాలోచన, యీ మీమాంసముతోనే కాలముహరించుచున్నది. కాలాతీతమగుచున్నది. తుదకు రెండును జేయలేను. నాయీపాడు చెయ్యి, అన్నగారిరక్తముతో నట్టట్టినఁగట్టుగాక! దళసరియట్టయే, కానిమ్ము. మల్లెపువ్వువలె, తెత్తునుజిడ్డు, నెత్తురుగడ్డు, వానలుచల్లు కడిగికొనుటకు, జలధార, వర్షధార పైనుంచిపడదా? తప్పుగావించినప్పుడు కాకపోయినపక్షమున, దయాదాక్షిణ్యముల ప్రయోజనమేమి? ప్రార్థనవలనఫలము ద్వివిధము. ఒకటి, పనులకుబూర్వము పడకుండఁజేసి నిలువఁబెట్టుట. రెండవది రాపడినవెనక క్షమియించుట. ఇఁక నాకేమి భయము? నాకేమికొదువ? పైకిచూడఁజాలుదు; కన్నెత్తి నఁజాలుదు. నాతప్పుతీరా జరిగినది. 'గతమ్',లో పడినది. ఏవిధముగు ప్రార్థనచేసి నేనుతరింపఁగలను? నేనుగావించిన ఖూనీ క్షమింపవలయునని వేఁడుకొందునా? అదికూడదు.

ఎందుకనఁగా, నేను దానివలనఁ బొందిన లాభములన్నియు నావశమున నేయున్నవి. నాకిరీటము, నాసామ్రాజ్యము, నా రాణి, నేరమునెత్తిమీఁద నెక్కి తన్నుచున్నప్పుడు క్షమ యెట్లు? లేదా క్షమింపఁబడినప్పుడు నేరమును సుస్వాగతముగ నుంచుటయెట్లు? లోకవ్యవహారికములో నందఱును మడియే కట్టుకొనికూర్చుందురా? మడియుండిన, మాన్యము లెక్కడనుండి యూడిపడుతవి? మడియుండిన మాన్యములుండవు. మాన్యములుండిన, మడియుండదు. ముద్దాయి" బంగారుచెయ్యి, "జారు" అనిన, అంతటిన్యాయమూర్తియు, అటుకుగింజ కావలసినదే. పప్పుజారినట్టు జారవలసినదే. న్యాయము, న్యాయము, అనినఁ, బొడిగఁగూర్చున్నదా? పిండికొలదియునురొట్టె. తడికొలఁదియు నప్పడాలపిండిసాగును. కొంచము బెల్లము వేసినఁ బేలాపుపిండియగును. గుటక పడుటయేతడవు. గళగ్రాహి. ఈయాటలన్నియును, ఆపైన సాఁగునా? తలతీసి తలమార్చుటకు వీలుకానిచోట్టు, స్థలము, స్థానము. జరగిన యితివృత్తమునుబట్టి యనుభవము. అందఱును మనమీఁద సాక్ష్యముల నిచ్చువారే? పాపపాపముల యొక్క తలయుఁ దోఁకయు, మొండెమును, బట్టబయలు గావింపఁబడును. ఆతరువాయిపని యేమియున్నది? పశ్చాత్తాపమున్నది. ప్రయత్నము చేసెదను. అదిచేయలేనిది యేమియున్నది? కాని, అసలు మనిషికిఁ బశ్చాత్తాపము కలుగనప్పుడు, పశ్చాత్తాపమేమిచేయును? ఓనాబ్రదుకా! ఎందుకువచ్చితుబ్రదుకా? ఓహృదయమా! ఎట్లుకమిలిపోతివి? ఎట్లుకమిలిపోతివి? చావుకళ యానన్నమగుచున్నట్లున్నది?

శాఖలకోఁజిక్కిన యోజీవమా! కులాసాయెక్కడకుఁ బ్రాకులాడినసీవు, నీకుబంధకములు, ప్రతిబంధకములింకను మిక్కుటముయ్యెనే? ఓదేవతలారా! దేవదూతలారా! పాహి పాహి మాం. మొగాళ్లువంగవదియేమి? మీకేమిరోగము? ఇంకను బవికిమాలిన పెంకితనమేనా? ఓడెందమా! ఉక్కుతీగలపుట్టవలె, కట్టవలెనుండిన నిఁకసాఁగదు. క్రొత్తగఁ బుట్టినశిశువుయొక్క యంగములవలె నతిమృదువుగను, అతి మెత్తగను యుండుఁడు. అంతయును సమసిపోవచ్చును. అతిపార్థన కుద్యుక్తుఁడయి మోకాళ్ల వంచువాఁడు. పెను శాపముఁగట్టుకొనిన గతభాగ్యుడు,

## క్లాడియసు.

ఆడఁబడిననాటకమిటు తల్లినిఁబెట్టిన తొట్రుపాటు చెప్పనలవికాదు. తనముద్దులకొమరునిమీఁద, మగనికేమి దురాగ్రహము వాటిల్లెదునో, యను, కంపమొకటి. అన లేదు. అనుభవించలేదు. కొడుకుఁగని, యించుకయలుకతో, నాయనా, మీతండ్రికిఁ గోపముతెప్పించితివి. హ్యాంలెటు కోపముపట్టఁజాలక పోయినాఁడు. చచ్చినట్టుపడియుండక, క్లాడియసు నామోచ్చారణచేయు మొగముచెల్లినదే, యను కొని, రుసలుచు, అమ్మా, నీవునాతండ్రికి నంతకుమించిన కోపము రప్పించినావు. రా, రా, నీకేమియుఁ బనిలేదు. అనిరాణి. పో, పో, నీవుదుర్మార్గతనఁ బ్రశ్న వేసినావు; అని హ్యాంలెటుయెత్తిపొడుచు. ఏమియిది, ఏమియిది, హ్యాంలెటు! నన్నుమఱచితినావేమి? కొడుకెప్పుడుమదల్లితో, నతిగౌరవ

ముతోను, ఆపేక్షతోను, మాట్లాడుచుండెడివాఁడు. కళవళ
ముపడుస్వభావముతో, నేనునిన్నుమఱతునని స్వప్నేపికూడ
తలఁచవలదు. మీయరాణిగారు. నాజనకునిసోదరుని భార్య
గారు. ఈరెండవవివాహము కాకపోయినపక్షమున నెంతో
బాగుండియుండును. అప్పుడు, సాక్షాత్తుమాయమ్మగారే.
క్రోధావేశయై, రోషావేశయై, తలుపువైపునకుజరగి, నీతో
మాట్లాడుటకు జేతనైనవారిని నీకువప్పగించెదను, అనెను.
హ్యాంలెటు, ఆమెమణికట్టునుబట్టుకొని, కూర్చుండఁబెట్టి,
యామెను గద్దులనీయలేదు. ఒకింతతడవు కూర్చుండుము.
అద్దమున నీనిజరూపమును గాంతువు. అనఁగనే, గెర్ట్రూడు
హడలిపోయినది. పైగా, పిచ్చిపట్టినసంగతికూడ వినియే
యున్నది. తననుజంపునేమోయని భయపడి, యెవరక్కడ
యని బిగ్గరగనఱచినది. తెఱవెనుకను బొంచియున్న పోలో
నియసు తత్తఱిల్లి, సాయమురండి, రండి, అని యెలుఁగెత్తెను.
ఆదాఁగియున్నవాఁడు తనపితృఘాతకుఁడు క్లాడియసు, అని
హ్యాంలెటు తలఁచినాఁడు. దొరకినాఁవురా, దొంగ. కసి
తీర్చుకొనుతరుణము వచ్చినది. కాలముపండినది. అని తెఱ
గుండా, హ్యాంలెటుకత్తిని దూసినాఁడు. ఎలుకచచ్చినదా?
అనియఱచెను. 'చస్తిని' అను నొకహీనస్వరము బైటపడినది.
పోలోనియసు తెఱమఱుఁగున దాగుడుమూతలు బహుమరగి
నాఁడు. ఎంతపనిచేస్తివి? అనిరాణి ఘోషపెట్టినది. తెలియ
దుగాని, రాజుగారాయేమి? చేతులునలుపుకొనుచు, ఎంతటి
దురుసుతనపు ఘాతుకకృత్యముచేసితివి? ఆసురమంటావా?
రాజునుజంపి, యాతనిసోదరుని ముడికట్టుకొనునంతటి యా

సురమా, యమ్మా! 'రాజునుజంపుటవలె' అంతువా ? అని తల్లి. అక్షరములా, నేనామాటనే యనినాను. మఱుఁగు యొత్తి, కత్తినిదూసి యమపురికిఁబంచిన పోలోనియసు యొక్క కళేబరమును, యీవలికిదొర్లించినాఁడు. శవమువైపు జూచి, యోరీగంధోడిగా! పానకములోని పుడకవలె, అన్నిఁటిలోను నీవేయుందువురా! అన్నియును నీకేకావలయునురా. తేళ్ల లోఁ దేలుగాను, జెఱ్ఱిలో జెఱ్ఱిగాను, నీవేయుఁదువురా! అవురా, అంతటిమాత్రమున నే సర్వవ్యాపివైతివా! మటు మాయమైపో. ఇఁకనుజాలును. నిన్ను నీవను కోలేదు. నీతలఁ దన్నువాఁడను కొంటని. కడ నిష్ఠురపుఁబని ముఁదున్నది. కావలసియున్నది. ఇంకను, ఉద్యాపనమేకాలేదు. అఁకరా ర్పణమేకాలేదు. కాలహరణమగుచున్నది. పొలోనియసు కళేబరము; వానిమరణవిమయమింకను, బ్రస్తాపనకుఁ గాలము రాలేదు. అమ్మవైపునకుఁదిరిగి చాలు. జాలు, చేతులూ రక యేల పిసికికొనియెదవు? ఒక్కింత సేపు కూర్చుండుము. నీగుండెపాటవముఁజూతము. నీవింత మొరటుఁదనము చేయుట కు నేనేమిచేసితిని? అనితల్లి గడగడ వణకినది. అనిసమాట కుఁ దార్కాణగ భూతదర్పణమామెయెదుట నెత్తెను. ఆమె తల రక్తనమంతయు బట్టబయలు గావింపఁబడినది. ఇదచిదఁబి దహాస్యముగాదు. మటుమాయామాయావి రహస్యమువిచ్చి పాటినది.

అమ్మా! మాతా! మాతాజీ, కడుపారకనుఁగన్న తల్లీ, నవమాసములు నన్ను మోసినతల్లీ! తిరిగి, ఓయమ్మా! మాయమ్మా! తిరుగు, యిటుచూడుము. రెండు బొమ్మలు

ఇటుచీఁకటి. అటుచీఁకటి. సృష్టి; విశ్వామిత్రసృష్టి. త్రిశంకుస్వర్గము నహీ. ఇద్దఱు నొక్కకడుపునఁ బుట్టినవారు. అయిననేమి? ఈయనినుదు రేమినుదురు? ముద్దులు మూట గట్టుచున్నది. గిరజాలయందము చెప్పగిప్పరాదు. వక్షస్థలము లక్ష్మీకాటపట్టు. ఆకనులెక్కడికనులు? ఆయనిమొగము జూచినవారికి హడలు. చూచువారికి దండతాడనములు ముఖతాండవముచేయుచున్నవి. మీసముకట్టుకు, పుట్టుకుఁ బ్రతి దేవతలును, అంగీకారముద్రవైచి, ఇదిగో మనిషి, మానవుఁడితఁడే, యనిలోకమునకంతకును జాటిచెప్పుచున్నారు. ఈయన నీభర్తగారు. గడచినవారు. నీమన్వంతరము గడచి, నవారు. నీతోడ వేగినవారు. కాలము భూతకాలము. ఇఁక నాకన్నులనిటు గిరుక్కునఁదిరుగనిమ్ము. ఏమియున్నది? వక్ష్యమాణవృత్తాంతము. ఇదిగో యిప్పటి నీభర్తగారు. కాలము వర్తమానకాలము. పాపము వర్ధమానము. చీడపురుగు. సిడ సిడపురుగు, సిరి పాకుకొన్నను నంటుకొనదుగాని, చీడ నిమిషము. అన్నకుఁబట్టుకున్నచీడ. అన్నను బొట్టఁబెట్టుకొనిన చీడ, (గజ్జికాకరకాయ). నీకు నేత్రములున్నవా? ఈవయసులోనన్నియు నుడిగినవెనుక, రక్తమాంసములు, రక్తమునకు రక్తము, మాంసమునకు మాంసము, దిగసనలోనున్నప్పుడు— మోహము వ్యామోహము, యీప్రాయమున..ఏమిసరసముగా నున్నది! సరసముగానున్నది! తోఁచినయాలోచనకే చెప్పవలయు. ఏమిచెప్పినను పుత్త్రలోఁ బుట్టినబుద్ధికి. తెలివి కాలిపోయినది. కాలిపోయిన నీచైతన్యమేలయుండును! చైతన్యమున్నదే? కాఁబట్టి తెలివితేటలకు, పరువుమర్యాదలకు,

ఆశ్లేషాలింగనకరణములకు, స్నే, ద్వి, స్వ, పక్షపాతము కలిగినవి. మహాదాశ్రయము మంటఁగలిపితివి. బుగ్గఁగలిపితివి. ఈశ్వరాగారము, సిగ్గునకు పుట్టించు ననుకొంటివా ? పిచ్చి కూఁడ నింతయర్ధ్వాన్నములోఁ బడదు. పరిపక్వముగాఁ, లేదనను. అనునయమాత్రమేమి బుద్ధిసూక్ష్మత యింతి లోను తారతమ్యములను గనిపెట్టఁజాలదా ? ఏదయ్యవమ్మా! నిన్నిటుల జాగుమాతల నాడించుచున్నది ! కల్లుకప్పిన మాయప్రేమను అలికిడి తెలియదా ? నీకన్న పెద్దా, ప్రత్తి గింజలా ? నీకన్న గొప్పయైనా, లేక స్వర్గజ్ఞానములేని పంజాయా ? మాటవరసకు, చేతులు, కనులు లేవనుకొందము, చెవులులేవు ? చెవులలోఁ జెల్లుమొలవినవియా ? అవియును లేవనుకొనము. ముక్కుయొక్కటియున్నఁ జాలదా? పంచేంద్రియములలోనేదైన నొక్కయింద్రియము, నిజ యల్లికనుండిన, కాస్తనాశిగనుండిన నుఁడుఁగాక, నీవుండిన యింటిలోఁ బడసియ్యాదుగదా. శిగ్గుశిరములెక్కడయున్నవి ? ఎక్కడ దాఁగియున్నవి ? ఓనగికమా! ఈ మెసీనయున్ నాటలాడించుచుంటివే ? మిసమిసలాడు వయసునను సువాదికేక పారగత మెక్కడ ? శగపొంత వెన్నకాదే ! శగపొంత మైనముకాదే? శగపొంత లక్కగాదే ? మన మెందుకు వీరినవలయును ? మంచువంటివస్తువునకు లోలోననుంచి యుడుకుపుట్టుకొని వచ్చునప్పుడు, మతికి మాసిక వేసినప్పుడు.

తల్లిని హేమాంతటు దులిపిదులిపి విడిచినాఁడు. ఎట్టికల్లి? వేదనప్పైకపాత్ర, గౌరవార్హ ! కోపముశాంతించి, క్షమించి, ఉపమాయించి, సిగ్గుశరము లామె మొగమున కెదురు మొగము

ఏలావిలంబింప? నీకంటికిఁ గలికము వేయుటకు వచ్చినాను. నీనాలుకకు; గారము రాచుటకు వచ్చినాను, నీ కాలికిఁ జక్రము కట్టుటకు వచ్చినాను. వేయేల! నీపిఱికికండకునుక్కు నొక్కించుటకు వచ్చినాను. ఈయలికిడి, అపలుకుడు, అంతయు రాణికి, రిత్తబయలు, ఉత్తగాలితో ముచ్చటలుగ గనుపించినది. తనసుతుఁడు వెఱ్ఱివాఁడే యాయెనని, మువ్వాఱ్టికిని స్థిరపడినది. 'మఱువకుము. పట్టుదలతగ్గవలదు' అనువాక్కులను చెవియొగ్గివినుచుండువానికి మాత్రమతిహీనస్వరముతో శ్రుతి పఱచి, మాయమయినాఁడు. రాణిగారికిదియంతయు నగమ్యగోచరము. మాయయ్యా! నాయనా! బట్టబయలుకు, నడుముకట్టుకొని, కన్నుఁజూపి, చెవియొగ్గి, సంభాషణజరుపుచున్నావు. నీవేమిచూచుచున్నావు? 'ఆయనను, ఆయనను' అనికొనుచు, అనఁగ, నామొగము తల్లికేమి తెలియును? ఏమికనబడును? తనయుని మానసికవృత్తికొఱకు, నీకేమియును గనఁబడలేదా? అని హ్యాంలెటు తల్లిని, హెచ్చరించెను. నాయనా, యేమియును లేదు. నాకు చత్వారమును లేదు. ఉన్నదంతయును గంటను జూచుచునేయున్నాను. అని దడదడలాడినది. హ్యాంలెటు, ఆశ్చర్యము. నీకేమియును, వినఁబడలేదుకూడగదా? తిరిగి యేమిచెప్పుమనియెదవు? మనమిరువురముతప్ప నాకుమఱేమియును గోచరమయినది కాదు. స్ఫురించినదికాదు! అనితల్లి. అదిగదిగో! ఆవైపునఁజూడుము. మళ్లి విగ్రహము, మటుమాయము కానున్నవిగ్రహముఁజూపి, పప్పు [illegible]ల్లెల్లు జారుచున్నదో చూడుము—ఇంకెవరు? మానాయనగారు, అచ్చంగా, ఆయనయే. బ్రదికియుండునప్పుడు

ధరియించువస్త్రముల, దుస్తులతో, నిస్తులుఁడగుచు నెటులఁ బోవుచున్నారో, యాశీవి. జూడము. చూడఁబోము. సింహ ద్వారము దాఁటనున్నాఁడు. సింహద్వారము దాఁటుచున్నాఁడు. సింహద్వారము దాఁటిపోయినాఁడు. రాణి కేమి తెలియును? ఏమికనఁబడినది? పైత్యపుజ్వరము. ఇఁక నొక మెట్టు యెక్కువ. పైత్యపుభ్రమ కాని వేఱు కాదని కొడుకునకు నాఁట జెప్పినది. నా నాడి చూడుము. నాయొడలు ముట్టిచూడుము. నుదురు తాఁకిచూడుము. నామనసిప్పుడుగదా శాంతించినది. ఉడుకుజారినది దుడుకుదుడుకుగుండె తగ్గినది. గుండెబరువు తగ్గి బెండయినది. మనసొక జీలుగుబెండయినది. ఆమెకంటె అమ్మకంటె, తాను నెమ్మదిగనున్నాఁడు. అమ్మనుజూచి, అమ్మా, యెంతయమోఘమగు నవస్థలోనున్నావు? నేను భ్రాంత్యావిష్టుఁడనుగాను. నేనుమాట్లాడినది నాపిచ్చిధోరణి కాదు. నీపిగపశాలపు బుద్ధి, దైవమునకైనను, నీచేసినతప్పిదము నొప్పుకొనుము. మించజరగినదానికి పశ్చాత్తాపముపడి పరితపించుము. రానున్నదానిని తొలఁగించుకొనుము. ఆవురుమని రాణియేడ్చినది. అతిరహస్యముగఁ గావించినపని వాడవాడలకెక్కినది. తల కొట్టివేసినట్టయినది. పుత్త్రునిఁ బిలచి, 'నాయనా, నాగుండెను రెండింటికిఁ దుంచివేసినావు. భళ్లునఁ బగులఁగొట్టినావు.' అనెను. అయినను మించినదేమియున్నది? ఇప్పటికైనను, తల్లికిఁ బశ్చాత్తాపము వచ్చినందులకుఁ గొడుకు పొంగిపోయినాఁడు. 'చెత్తనుబాఱ వేయుము. బ్రదికిపోదువు' మిగులుభాగముతో మంచిబ్రదుకు బ్రదుకుము. శలవు శలవు. మీశలవును దీసికొనుచున్నాఁ

తను. నేనుకోరుచున్నాఁడ. నన్నాశీర్వదింపుఁడు. మీయెడల నాకుఁగల మాతృభక్తివలననే, నేనునిష్ఠురముగఁ బలికితిని. అంతకుమించ మఱియేమియును లేదు. ఆపరమశాత్రవుఁడు, పరమహాంతకుఁడు క్లాడియసుతోడి విడియాకులు వైచుట యుత్తమమనియును, సమంజసమనియును, నిప్పుడిక్కడజరగిన రహస్యపుఁగపిలి విప్పగిప్పవలదనియును, తనపిచ్చి, పెట్టుపిచ్చి యనియు, పెట్టబడిపిచ్చియనియు, చెల్లుబడిపిచ్చియనియు, నంతయునుఁగూడ, గుట్టుమట్టుగ నుంచవలయుననియు, అట్టు గావింపజనదనియు, మూసినవాయిముగ నుంచవలయుననియు నొక్కివక్కాణించెను. తల్లిప్రాణము తల్లడిల్లిపోయినది. తల్లులులక్కముక్కలు. బిడ్డలు బొమ్మరాళ్లుగదా! కోరికకోరికకుఁ దలయొగరవైచినది. అంగీకారసూచనము. అర్థము కాదు. పూర్ణాంగీకారమే.

తండ్రిభూతముచెప్పిన మాటలకాలాపనముగ 'మాటలు మన యుచ్ఛ్వాసనిశ్వాసములవలనఁ బుట్టుచున్నవి. వీటికాటపట్టు ప్రాణము. నీవునాకుఁజెప్పిన మంత్రోపదేశమే, యీయుచ్ఛ్వాసనిశ్వాసములకు రణపట్టుగఁ జేసెదను. నాకింతకుమించిన బ్రదుకు లేదు.' అనుకొనెను. తిరిగితల్లివైపునకుఁదిరిగి, 'శలవు మహాశలవు. కడపటిశలవు' అనెను. రాజుగారియాజ్ఞ, యీతనినితక్షణము, ఇంగ్లండు (England) కుఁ బంపవలయుననియు, దనచిన్ననాఁటిసహపాఠిలు, రోజన్‌క్రాంజ్, గిల్డెన్‌స్టెర్న్ లనుచరులనియు, హ్యాంలెటు తనలో 'పేరిరువురు కోఱలుగల విషసర్పములు, నాపాలిఁటికిజాగరూకతతో మెలఁగెదను.' మఱియు, పోలోనియసుయొక్క కళేబరము

నొక్క పొర్లిగింత, దొర్లిగింతగావించి వెళ్లిపోయెను. ఈతని చావుకు నిజముగుపశ్చాత్తాపము హ్యాంలెటుకుగలదు. ఆయుని భూస్థాపనము జూతును. ఆయనిచావునకుఁ దగుసమాధానము చెప్పెదును, అనెను. తనతండ్రికిని, తనకును, విశ్వాససాహ్య ముగల, యిప్పటిరాజాశ్రియుఁడు పొలోనియసుచావునకు, తనకు మితిమించినదుఃఖము కలిగినట్లు నటించుటకు, హ్యాంలె టుకుఁ జేతగాదు, తెలియనిచేయిని, విసిరి పొలోనియసును సాగనంపుట హ్యాంలెటుకు విచారముకలిగించినది. ఎంతటి చెనఁటయైనను, దనసౌందర్యలహరి ఒఫీలియాకుత్పత్తిస్థానము గదా!

# HAMLET.
## PRINCE OF DENMARK.
## హ్యాంలెట్.
### డెన్మార్కు కుమారరాజా, హేమాహేమీ.

---

## విధ్వంస కాండము.

రాణి కొడుకునకు మాటయిచ్చినప్రకారము మాటకుఁ గట్టుపడినది. జరగినసంగతి భర్తగారడుగఁగా, హ్యాలెటు యిప్పుడేమి చేయుచున్నాఁడని యడుగఁగా, పాపమాపిచ్చి సన్న్యాసి, గాలివానవచ్చినప్పుడు, సముద్రుఁడును, యీదురు గాలియును సల్పుపోరాటమువలె, పిచ్చిలో దొర్లింతలు,

పొర్లిగింతలు పెట్టుచున్నాఁడనియును జెప్పినది. ఇందుకు నిదర్శనముగఁ దెలుపుటకుఁగాక తలిక కనివిని, తనభల్లమును లాఁగి యొకయెలుకయని యెలుఁగిడుచుఁ బ్రమాదవశమునఁ జూడని ముసలివానిని, యమపురికిఁ బంపెను. విని, క్లాడియసు, గజగజవణుకు, ప్రమాదకమైన వ్యాపారము, మనమక్కడనుండిన మనపనికూడ సాంశఘమయెడిది. క్లాడియసు, అని కొసినతుది మాట వాస్తవము. ఇప్పుడెక్కడనున్నాఁడు? అసియెలుఁగు, రాణికిఁ డనకు మాకనిఁ గాపాడవలయునని తలఁపుయొక్కటి తప్ప మతేమియును లేదు. అంతటిపిచ్చిలోఁగూడ నతఁడు స్ఫటికమువలె స్వచ్ఛమనియు, తాను జేసినదాని కేడ్చెననియు, సర్దిచెప్పెను.

ఈశవము తనదియేనై యుండినయెడల, వాఁడికంట నీసీరుం డెడిదికాదు. హ్యాంలెటుపిచ్చికాని, మంచికాని, సముద్రము మీఁద ద్రోసివేయఁబడువఱకు నొక త్రుటికాలమైనను, తనకు మనశ్శాంతి కలుగనేరదనియు, రోజంక్రాంజు, గిల్డెన్ స్టెర్నులను, అర్థచతుష్టయమును, దుష్టచతుష్టయములోఁ జేర్చి సగమును, అదే రేయి యే పయనమునకాయిత్తముచేసి, యింగ్లండు దర్బారుకు, హ్యాంలెటు, అక్కడ పాదము మోపఁగనే, యింగ్లండు, డెన్మార్కులకును, దర్శ్యాముమీఁద స్వమస్తలోకమునకును, జనకంటకుఁడగు నితనిసిజాగుచేయక యముసదనమునకుఁ బనుపవలయునని, యాజ్ఞాపించెను. పోలోనియసుమృతి క్లాడియసుచేతికి హ్యాంలెటును ద్వీపాంతరవాసముచేయించుటకుఁ దగిన హేతుఖడ్గమునిచ్చినది. డెన్మార్కులోనే హ్యాంలెటును జంపించియుండవచ్చును గాని, క్లాడియసుపైకి దారువు

వలె, బూతికిబొమ్మవలె, ఉచ్ఛవిగ్రహమువలె నగపకునుగాని, చుతిభీరువు. తానుజేయు వ్యాపారములన్నిటిలోను, అపసవ్య సాచి, ఇంకేమి ? ఆరాతిర్రియే.

హ్యాంలెటు కళితీక్ష్ణకొనలేదు. తనశత్రువు శ్లాఘియుసా హాతమాన్ఛలేదు. డెన్మార్కునుంచి యోడప్రయాణము చేయ వలసివచ్చినది. అయినను, తిరిగి యనతికాలముననే, డెన్మా ర్కునకుమళ్లి నిదిలకురాం దీర్మానించుకొనెను. తనతోడంబం చిన యీశోడపింఙ్లకొనుకులమీందం గన్నువైచవలెనని తలం చెను. చేతులారచేయుం దలంచుకొనినపని నెఱవేర్చుటకుం బూర్వమే సముద్రముమీదనే బోవలసివచ్చినదే,తడంబడినదే, నేటికొక్క దైవము లేకపోయెనే ? యని, తిరిగి, దైవమునసం బనియేమి ? కొండంతలోపము నానెత్తిమీందం బెట్టుకొని. ప్రతికథపట్టుయును, నామీందనే సాముచేయుచున్నది. చీవా ట్లుపెట్టుచున్నది. నాకసికికత్తులు నూరుచున్నది. పదునింకను వచ్చినట్టులేదు. చేయందలంచుకొనినపనికి, నడుముకట్టుకొనుం దియున్న, నడికట్టు, నడుముకట్టుబిగియనే బిగయదు. సంతకుం గొనిపోవు పశువులవలె, మేంత, నిద్రకుంబడక యీరెండుయు నుండిన, సింగ్రిభోగమే, దేవేంద్రభోగమే యనుకొనిన, నా మనుష్యుండును, మృగమును, తక్కుడుయొక్క రెండుతానుల లోను, సులతూగుదురు. మొగ్గు యెటుయునులేని, తూనిక. బంగారముతూనిక. అసరంజితూనిక, యగుగాక. మనలను బుట్టించిన బ్రహ్మదేవుండు, సచ్చిదానందపరబ్రహ్మమూర్తి, యింతయంత యనరానిబుద్ధినిం బ్రసాదించి, ముందు వెనక, మంచి చెడ్డ చూచు, సామర్థ్యమునిచ్చి, కడుపునిండంగుడిచి,

కంటినిండ నిద్రఁజెంది, తుప్పుపట్టినట్లు తుప్పుపట్టునట్లు మనసునుమిన్నక యుంచుఁడని వ్రాసిపెట్టియుండలేదు. ఏమిరో చెప్పఁజాలకున్నాను. ఎద్దుమొగ్గుస్వరూపమునో, లేక నాకుఁబడుకొనియున్న, అతి తెలివితేటలో, లేక, యొకతలంపులోపలనున్న నొకభాగముమాత్రము బుద్ధిప్రతిభ, తక్కిన మూఁడుపాళ్లునుభీరుత్వమో, యేమో నేఁజెప్పఁజాలక యున్నాను. అయినను నేను బ్రదికియుండి,బడితెవలె తిరుగుచు, నీకార్యము నేను నిర్వహింపవలసి యున్నది, అందున. కాని, చేయుటకుఁ దగినంత కారణము, మనస్సంకల్పము, బలము, సాధనసామగ్రి, సాధనసంపత్తు, సాధనతార; కాని తారబొమ్మమాత్రము లేదు. ఇల్లో, బొమ్మరిల్లో, పొట్టకుమాత్రము నించుకొందుము. పడిపోర్లుదుము. నిద్రపోదుము. చేతికనోటిమీఁద సవారితప్పదు. మఱియొకరంధి లేదు. నాబ్రదుకంతగు నీరీతిగనే తెల్లవారిపోవుచున్నది.

తగినతరుణమునకు వేచియుండి, యొకనాటిరాత్రి వారిరువురు నిద్రించుచుండఁగ, ఇంగ్లండుదర్బారునకు, క్లాసి యనుపంపిన యుత్తరమును విప్పి తెఱచెను. చోరవయే చేసినాఁడు. తానుబసిగట్టిన దురాలోచనను జదివినాఁడు. అతిశీఘ్రమునే, అవిషప్రచ్ఛములకిద్దఱికిని, తగినశాస్తిని చేయునట్లు, యుపాయమునుబట్టుకొని, స్వాతనకమ్మఁ బ్రాయనుపక్రమించెను. తననామమునకుఁ బ్రత్యామ్నాయము, నిజద్రోహులు రోజన్‌క్రాంజ్, గిల్డెన్‌స్టెర్నుల, నామద్వయమును జొప్పెగి, దైవవశమునఁ దనయొద్దనున్న తనతండ్రి డెన్మార్కురాజాముద్రతో లక్కముద్రలువైచి, చీటికిఁ బ్రాణమువ్రాలు

గనుక, క్లాడియసు దస్కతువలె దస్కతుచేసెను. తిరిగియథా స్థలమున నుంచెను. మడతలుమారలేదు. నలుగుడులేదు. పాచికలు మాత్రము మారినవి. లోనియుత్తరమునందలి మార్పులు పైకి సుమంతయును గోచరింపలేదు. రెండుదినములు గడచినవి. ఓడ పైనపైపోవుచున్నది. సముద్రపుదొంగలు వారిపైఁబడిరి. యుద్ధములో హ్యాంలెట సముద్రములో దుమికి శత్రునావలోఁ జిక్కెను. తనయోడ యీలోపుగ, నతివేగముగ సాగిపోయినది. హ్యాంలెటు తప్పినాఁడు. సముద్రముపాలైనాఁడు, తమసంతోషముపాలు పొంగినవి. వాఁడి కర్మమువాఁడిది. 'మనపొంగుమనది' అని వారుబ్బిపోయిరి.

ఇటీదొంగలదొరలు హ్యాంలెటు కుమారరాజని సునిశ్చితముగ గుర్తుతెలిసికొని, తమకుఁబ్రత్యుపకారము, ముందు కాలమున తానుచేసినచో, డెన్మార్కురేవుయొద్దన, విడిచెదమనిరి. ఎట్లైననేమి? టికాణాకుఁ జేరుకొనినాఁడు. అయుత్తరక్షణమునసే, హరేషియోకు, తనను గలసికొనవలయునని కబురుపంపెను. క్లాడియసుకు, తనరాకను దెలియపఱచెను.

ఈమధ్యకాలమున పోలోనియసుకొడుకు లెర్టిస్. తనతండ్రి దుర్మరణవార్తవిని ఫ్రాన్సుదేశమునుండి బయలుదేరి హుటాహుటినిక్కడకు వ్రాలినాఁడు. గుమగుమ కనలినాఁడు. సహింపఁజూర్తయే. ప్రళయకాలరౌద్రాకారము దాల్చినాఁడు.

"చ॥ పెటపెటఁ బండ్లుగీటుచును జెట్టుగ హూంకియుచుఁ గన్నుఁ
గోనలం । చిటులు విస్ఫులింగములుసింద । మహోద్ధత
పాదఘట్టనన్ । ఇటునిటనై ధరిత్రిపడకాడ, వడిన్"

రాజసౌధము జొరఁబడినాఁడు. రాజునెదుటనిలిచి,తనతండ్రి యొక్క హత్యాస్మరణము, రాచమర్యాదవిహీనముగుకర్మక్రియా విరహితముగు,భూస్థాపనమునకుఁదగుసమాధానముగోరినాఁడు. క్లాడియసు తత్తరిల్లినాఁడు. లెర్టిసును మెల్లఁగసాగనంపినాఁడు. చల్లగసాఁగనంపినాఁడు-ఈచేతనుజనంతయల్లరిచేసినది.ఎట్లెట్లో, లెర్టిసుకు, తనమీఁదఁగల యాగ్రహమును, హ్యాంలెటుమీఁదకు దార్లించినాఁడు. తనకుఁగలిగిన గ్రహబాధను దప్పించుకొనినాఁడు. తనలోపమేమియును లేనటుల లెర్టిసుకు, పూర్తిగ నమ్మకము గలిగించినాఁడు. విశ్వాసము కలిగించినాఁడు. తానుముందు జరుపఁదలఁచుకొనిన చర్యకు లెర్టిసును, ఒకపనిముట్టుగ మార్చెను. విషాదము లెప్పుడు నొంటకాలనిలఁబడవు. క్లాడియసు, గ్రహకూటమింకను బాగున్నది. తనపూనిక కూఁతయైనది. లెర్టిసు, మచ్చరము నిప్పచ్చరమయినది. అతఁడిహృదయమున నిండియున్న కోపాగ్నికాజ్యమయినది. తనచెల్లెలు ఒఫీలియాసుందరి తనతండ్రిచావువలనఁ గుంగిపోయినది. కృశించిపోయినది. అందులోఁ, దనహ్యాంలెటు చేతులార పోయినాఁడు. విచారసాగరముల, ఒఫీలియామనసు మునిఁగిపోయినది. మతిమీఱితిరిగిపోయినది. చిత్తము చలించినది. చలచిత్తము వచ్చినది. కళ్లు వెఱ్ఱిచూపులయినవి. నోరు దాకనోరయినది. దినమంతయు నేకాంగయై, గుడవుల మెట్టును తనలోఁదానే, ఋతుపాటలేమి జాతపాటలేమి, యీపాటయాపాటయనక, యన్నిరకములగు పాటలనుబాడును, నవవిపూవులు గోయుచు, లాఁగుచుఁజుణుకుచు, దారిపోవువారిపైఁబడవైచుచు,'తెయ్ తెయ్'మని యాడుచుండెను.

లెర్టిసుకు, ఆతనికు, తన చెలియలి, యీయునికి తెలియనే తెలియదు. రాజుతో మాట్లాడుచుండఁగా, ఉన్నట్టుగా, బయట నొక గందరగోళము జరిగినది. 'ఆమెను రానియ్యండి' అను నఱపులు వినవచ్చినవి. వగపుచిత్తరువు, కళవరముకరువు అగు తన సోదరునిఁజూచి, అన్న లెర్టిస్, అఘోరించినాఁడు—ఆమెయా వీక్షణమునకేటు రాజుయు కనపించ లేదు. ఇట్టి తన యన్నయును గనుపించలేదు. తన తలమీఁద నడవిగొబ్బి పువ్వులు ఉమ్మెక బంతిపువ్వులు దండలు వేసికొనెను. తనతోఁడ నదే పువ్వులు నిడుపులయినవి. తనకిరువైపులను జీరలాడుచు నుండినవి. కలలోవలె, చుట్టిచుట్టి, తిరిగెను. నోటిపదములు మెండయినవి. కూనిరాగములు జోరయినవి. తండ్రిచావుకుఁ జుట్టుకొనియే యున్నది. ఇదంతయు నపస్మారమును జూచి లెర్టిసు 'నా కళ్లు కాలిపోవ, ఏండ్లపూండ్లయినవా! ఆ ముక్కు పచ్చలారని కిట్టడాని మతి, కూలిపోయినదే?' అని రోదనము. కత్తిపిడిగట్టిగ నదిమిపట్టుకొని, నీకుఁయీగా తెచ్చిపెట్టిన పిచ్చితనమునకు యెత్తుకుయెత్తు వప్పఁజెప్పుదును. ఆమ్మాయీ, నీవు చూతువుగా! ఏదేదో, గొణిగికొని తనయన్నమొగము చూచినది. గుండెపగిలినవాని పలుకులతో నీవు చెదరక, స్వస్థచిత్తరాలవుగనుండి, కసితీర్పవలసినదని యెవరైనను, నాకుఁజెప్పిరేని, నాకిప్పుడు వలె నచ్చియుండదు. లెర్టిస్, యేమియనిన నేమిప్రయోజనము? ఏమిపలుకరించిన నేమిలాభము? అంతయు నరణ్యరోదనము. ఆమెకు 'అన్న' యనుగుర్తుయే లేదు. పిచ్చిలోను, తండ్రిసొద, సోదరేప్పుడు. ఇంకొక సోదిలేదు. రోగికోరినదయుఁ బాలే. వైద్యుఁడు చెప్పినదియుఁ బాలే.

ఇంకేమికావలసియున్నది? లెర్టిసువిషాదమీాసమయమున క్లాడియసుకత్యంతవసరము. హ్యాంలెటు మారణకర్మకుశిరసా పూనుకొనుకర్మశీలుఁడు ముఖ్యము. కాఁబట్టి పొలోనియసుమీాఁదఁ తనకతిప్రేమ కలదనియు, ప్రాణస్నేహితుఁడనియు, నేమేమో, యిచ్ఛకములుచెప్పి, అటువంటి తనతండ్రినిఁ జంపినట్టియు, తనచెలియలి పిట్టిపిచ్చికిఁ గారణభూతుఁడయినట్టియు హ్యాంలెటు; పట్టాభిషిక్తుఁడగు తనచావునకు ఎసరు వేయుచున్నాఁడని చెప్పెను. అట్టికులద్రోహి, రాజద్రోహిని యేల యింతవఱకును దలతుంచకయుంటిరని లెర్టిసు, క్లాడియసు, సమయస్ఫూర్తి చక్రవర్తి. జవాబుకుఁ దడవుకొనవలయునా ?

తగినకారణములు తగుకారణములు రెండున్నవి. మీాకుఁదోఁపటిగఁ దట్టునోలేదో, నాకుమాత్రి మఱిబలీయములు. అతిబలానీకములు. వాఁడితల్లి, నాకురాణి. వానిమీాఁదనే కనులు పెట్టుకొని పంచప్రాణములు పెట్టుకొని బ్రదుకును. నామాటందువా ? సుగుణమునకో! రోగమునకో, ఏదైనను కానిమ్ము. ఆమె నాప్రాణాధారము; తోడు, నీడ. ఆమెవినాగా, నాకుబ్రదుకుయేలేదు. ఆమెమొలనూలునఁ గట్టువడినవాఁడను, రెండవది, అచ్చకెక్కి నేను బ్రదుకఁగలనా? పారాగతమున్నదా ? ఆబాలగోపాలము, పిన్నపెద్దవిచక్షణలేక, వాఁడు, అనినఁ బ్రాణాలనిత్తురు, విడుతురు. వానికి యున్న యవకరములకన్నిఁటికిని, మసిపూసిమారేడుకాయో నేరేడుకాయో, వాటముకుదిరినట్టు చేస్తారు. జనముద్దుపట్టి. ఒప్పువాఁడీడి; తప్పునాఁడ; అంతువలన నేను వానిపై వేయు

బాణములన్నియు పోనేపోక, నాపై నెదురుతిరుగును; విఱుచుకొనిపడును.

ఇదంతయును విని, లెర్టిసు, అయినసరి. అటువంటి నాతండ్రిపోయినాఁడు. చెల్లెలుమఱి ముక్కచెక్కలయిపోయినది. అయిననేమి? నాకసితీర్చుకొనుటకుఁ దరుణమురానున్నది. మాటయింకను ముగింపులేదు. ఒకభటుఁడు హ్యాంలెటుయొద్దనుండి జాబుపట్టుకొనివచ్చెను. మనిషినిజూడఁగనే క్లాడియసు జంకిపోయినాఁడు. "మహాప్రభూ! మీరాజ్యమునఁ దలవిరియఁబోసికొని పడినాఁడను. నేను దేవరవారి కన్నులయెదుటఁ బడియెదను. అందులకుక్షమాపణము వేఁడుకొనియెదను. ఆకస్మికమగు నద్భుతమగు నాయీరాకకు నిమిత్తము విశదముచేసికొనియెదను—" హ్యాంలెట్టు చేయఁదలఁచుకున్నకుట్ర నట్టేటఁగలిసినది. లెర్టిసును గార్యసాధనకుఁ జేయూఁతగఁ జేకొనుటకుఁ దరుణమువచ్చినది. హ్యాంలెటు రాక తెలియఁగనే, లెర్టిసు తనకుఁదానే, ఆస్థలమునకు వ్రాలి ప్రత్యక్షముగ హ్యాంలెటుమీఁదఁ గత్తులుదూసి, తనతండ్రినిఁ జంపినపగ సాధించుకొనెడి వాఁడు. క్లాడియసు, యిప్పుడు తానేమియనినను, లెర్టిసును, పురికొల్పినట్లు కనఁబడును. ఉగ్రమువారాటుపఱచి, హ్యాంలెటును, పైకిన్నే హారీతిగఁ గత్తులు దూయునట్లు చేయుటమంచిదని తలంచెను. హ్యాంలెటు కనుమానముండదు. కనుకనే లెర్టిసు తనయాయుధమును బౌరుషముతోఁ జేకొని, విషముపూసినమొనతో నూరకరాచినను, సునాయాసముగఁ దనకసి తీరును. సంకల్పము కొనముట్టును. ఎవరిమీఁదను, నిందమోవదు. వాఁడీననికూడ

ప్రమాదమనును.

హ్యాంలెటు తనరాజ్యముఁగరిని, యొడ్డున, సమాంతముగ, చాపచుట్టుగ, నిరాధారిగఁబడిన వర్తమానము వినిన తడవుగనే ఱెక్కలుకట్టుకొని వ్రాలినట్టు వ్రాలినాఁడు. ఈ రెండుహంసలును, రాజహంసయొకటి, పరమహంసయొకటి, కలియఁగనే, తత్త్వధారదట్టమగును. హ్యాంలెటునుండి తత్త్వము దొర్లుకొనివచ్చినది. నామనసులో నొకరీతి యావేదనపుట్టుకొని వచ్చినది. నన్నుకొఱికి తినివేయుచున్నది. కంటికి మూఁత యనుమాటలేదు. నిద్రపోనియ్యలేదు. ముండ్లపాద మీఁద గుడ్డవైచిపరుండిన ట్లే. దురుసుతనము, దురుసుతనము, అని నీరసముగా, యీరసముగా, విరసముగా, దానిని జనులు విదిలించికొట్టుదురు. దానికపుడు చల్లఁగా, దానినే, ఆదురుసుతనమునే నెత్తిమీఁదఁ బెట్టుకోవలెను. ఒక్కొక్కసమయమున, నేదియో పనిచేయవలయునని మనస్సులో బుద్ధిపుట్టును. చేసినఁగాని, నిద్రపట్టదు. చేసియే తీరుదుము. టక్కునఁ గుదురును. అతుకును. బ్రహ్మాస్త్రమే. అమోఘము. బ్రహ్మప్రళయముగావించి, పొడిచివేయుదుమని నెలలతరబడి జేయు నాలోచనములు, పన్నాగములు, ఆకాశమునకును, భూమికిని దాళము వేయవలెననుకొందుము. పద్మవ్యూహము పన్నుదుము, పన్నినాము, అనుకొందుము. ఏమియును గల సిరావు. కలిసికట్టుతనములేదు. మనప్రయోజకత్వము దేనికని సార్థకములేదు. వీటియన్నిఁటివల్లను దేలు పర్యవసానమొక్కటి. మనచేఁతలకువెనుక, మనచేతులనుబట్టుకొని, నడిపించు, అనిపించు, ఆడించు, దేవుఁడు, అంటు నొక్కఁ

డున్నాఁడు. చేఁతసాఫీకాకపోయిననేమి ? నాజూకును, పని వాఁడితనమును, ఘనందును, తగ్గినమాత్రమేమి,? కావలసినది జరగియేతీరును. క్రియ పరమహంసక్రియ, సంవిధానము సర్వ తమును గిరగిరగొట్టు గరగరయయిననేమి ?

ఇద్దఱునుఁగలసి, యెల్సినోరుకుఁ బయనమయినారు. ఏపనిచేయుచున్నను, తనపితృభూతము ఘంటాపథముగఁ జెప్పిన, యుపదేశించిన, యనుశాసించిన 'సన్న్యజ్ఞప్తియం దుంచుకొనుము' అనువాక్యస్మరణము నిరంతరము, హ్యాంలె టుకు, ఓంకారనాదమయినది. ఎల్సినోరు దరిదాపునకుఁ జేరుచు, దేవాలయపుదొడ్డిలో నొకశవము, భూస్థాపితము కాఁబోవుచుండెను. ఎవరిదియుండును ? అని నిలఁబడి, సమా ధితయారుగావించు మనిషినడిగిరి. ఎవఁడికయ్యా! యీసమా ధిని త్రవ్వుచున్నారు ? అనిహ్యాంలెటు, 'ఎవఁడికికాదయ్యా' అనివాఁడు, సమాధానము. కాకపోయిన నెవతెకు ? అని హ్యాంలెటు. ఎవరికినికాదు, అనివాఁడు. ఎవరిని పాతిపెట్టు దురు ; అని హ్యాంలెటు రెట్టింపు. ఆఁడుదిగా నుండియున్న దానిని. ఆమొకడుపుచల్లఁగా, ఆమెచనిపోయినది, ఆమెను. వానివృత్తికిఁ దగనివదరుఁబోతుదనమునకును, జవాబులకును హ్యాంలెటు విస్మితుఁడయి, యెంతకాలమునుంచి నీవీయుద్యో గమును మండఁబెట్టుచున్నావు ? అని హ్యాంలెటు. ఎంతకాల మంటావా ? నీకుఁదెలియదా ? ఏవెథవనడిగినను జెప్పును. సుప్రసిద్ధుఁడగు హ్యాంలెటుమహారాజు, ఫార్టిన్బ్రసును, అట్టు మాడఁగొట్టిన దినమున, నేనీవృత్తికిఁ గాలుపెట్టినాను. ఆరోజేమి ? ఈరోజేమి ? కుఱ్ఱవాఁడు హ్యాంలెటుపుట్టినరోజు.

పిచ్చిపట్టి, పిచ్చిపుట్టి, పిచ్చియెత్తి, ఇంగ్లండుకు పంపినారే, ఆహ్యాంలెటునే. అదిసరేగాని, యింగ్లండుకేందుకుఁ బంపిరి? అనిహ్యాంలెటు. ఎందుకా? పిచ్చిపట్టినదిగనుక, మతిపోయినది గనుక (పలుగుతో, గునపముతో, గిట్టిపోటు నొకటి వేయుచు) అక్కడ మతితిరిగినఁ దొరుగును. లేనియెడల నెవరికేమితెలుగు. ఏమియునింగినదిలెస్సు. పోతేపోఁచే పోవును. ఇంతకును, అక్కడ యితనిపిచ్చి యంతపట్టుపడుగ నుండదు. ఎందుకా? అక్కడ నందఱకును, యింతపాటిపిచ్చియే కలదు. ఎందుల కాపిచ్చి? అనిహ్యాంలెటు. తనతలపంకించుచు, యేమేమో విపరీతముగఁ జెప్పుచుండును. ఏమియావిపరీతమయ్యా? 'కప్పువిప్పు, విప్పిచెప్పు, చెప్పితీరుము' అనిహ్యాంలెటు. తనయున్మాదమును గుఱించి ప్రజలు మహాజనులు తమలోఁ దామేమిచెప్పుకొందురో వినవలయునని మనవాఁడికిఁ గుతూహలము. కాని, వీఁడుదొరకునా? దొఱకెడిపిండమా? ఎందుకా? మతిపోయినది. మతిపోయిన పిచ్చియెక్కడా? ఎంతయూఁచినను, వీని వలన నొక్కనిక్కుంపుఁ బలుకైనను రాలలేదు. మాటల కేమికొదువ? నోటికినిండుమాటలేను. ఏప్రశ్నయడిగినను, జవాబునకుఁ దడవుకొనఁడు. నీళ్లునమలఁడు. చప్పరించఁడు. చంటిపిల్లలవలె పాలుకక్కఁడు. కడుపుబ్బరించదు. అంతయును లోలోనసే భర్జించుకొనును.

సమాధిత్రవ్వుచుండఁగ, గునపమునకుఁదగిలిన, ప్రాఁత బొమికలను శాఅశేయుచుండఁగ, హ్యాంలెటుకంటితోఁ గనుచుండెను. కనిపించలేదని, 'తత్త్వమసి' ధారవెలువడినది. ఎంతటిసామంతముగల మనిషైననేమి! సామంతము,

ధీమంతము, లక్ష్మీసామ్రాజ్యము, మరణానంతరము గవ్వ
కును గొఱగావు. ఈబొమికలే మిగులు. మిగిలినవో, అం
తట తగులాటమునకును. ఈబ్రిదుకు మూఁడునాళ్లపట్టపగలు
మురిపెమేగదా! దీనికేగదా మునిసిపడి చత్తురు,

"ఉ॥ దేహము వాయుసంచలితదీపిక పుత్త్రకళత్రమిత్రసం
దోహము స్వప్నకాలమునఁ దోఁచినసంపద రాజ్యభోగస
న్నాహము జంత్రితప్రతిమనాట్యముసంపద యింద్రజాలమీ
యైహికసౌఖ్యమేమనసుఖమంచుఁ దలంచెదనయ్య"

తనకాలమునఁ బ్రపంచమునంతయును గెలిచి, గడగడ
లాడించి, యింకనుజయించుటకు రాజులును, రాజ్యములును
లేకపోయెనే! యని నిట్టూర్పులనిగిడించిన, ఆలెగ్జాండరు
(Alexander the Great) సైతము, తుదకుచావనే చచ్చినాఁడు.
పూడ్చినారు. మన్నైనాఁడు. మన్ను మన్నులోఁ గల
సినది. మిన్ను మిన్నులోఁ గలసినది. చెత్త చెత్తలోఁ గలసి
నది. చిత్తు చిత్తులోఁ గలసినది. సత్తు సత్తులోఁ గలసినది.
తిక్కమాలిన నిను పీడకును, అలగ్జాండరు సర్వంసహాచక్ర
వర్తికినిఁ దారతమ్యమేమున్నది? అంతయునొక్కటే మృత్తిక.
ఒకేమట్టి. తిరిగి యీమట్టితోనే మనమున్ని యోపనులు,
కార్యములు చేయుదుము. ఒకమట్టిముద్దతోఁ బెద్దసారాపీపా
యిమూతిని బిగింతుముగదా, అహంతతో ధుమధుమలాడిన
సీజరు (Caesar) మహాచక్రవర్తి, ప్రపంచమునంతయును
గడగడలాడించినవాఁడు.

"చ. ................ ఆయువుశాశ్వతంబె? సంపదలు
స్థిరంబులే? విధివిపాకముదాఁటఁ దరంబె? యేరికిన్"

తుట్టతుదకుఁ జచ్చి, మన్నైచుయి, గాలివీచకుండ నౌకరంధ్రమునకు బిరడావలెనుండునోపు. ఈమట్టియేకదా, యొకకాలమున భూమినంతయును గిరగిర గిరికీలనుగొట్టించినది అట్టి, యీమట్టి, లోనికిఁ జలికొట్టకుండ, నౌకరంధ్రమునకు, గోడలోనిచిల్లికి మాసికవేయుచున్నది. ఆహా, యేమి యీ కాలవైపరీత్యము ? ఈయిహలోకపదవి యింతయేకదా, ఇంతటితోనే సమాప్తిగదా ! అయినను, జనులు దీనికొఱకే గదా తమయాత్మలను, దెగనమ్ముకొనుచున్నారు. ఈక్లాడి యసును, ఖూనీవంటి కారాని దురాగతకార్యములను జేయించినది! ఈధారయు మఱియుసరికి మెల్లమెల్లఁగ శవము స్మశానవాటికకుఁ జేరుకొనుచున్నది. హ్యాంలెటు హారేషియోలు మాత్రమితరుల కగపడకుండవంతయుఁ దాముగనుటకువీలగు రహస్యస్థలమున డాఁగియుండిరి. రాజు, రాణి, మిగులు రాజపరివారము, రాజాశ్రయులు, అశేషయావజ్జనము వెంట వచ్చిరి. కర్మలేదు, వాయిద్యములేదు. మంత్రోచ్చారణ లేదు. ఈచిహ్నములనుబట్టి, చనిపోయినమనిషి గొప్పవంశీకురాలనియుఁ జావు, ఆత్మహత్యవలనజరగినదనియు, స్నేహితులిరువురు నను కొనిరి. ఈపరివారము, సమాధిచుట్టు నాఁగఁగనే, లెర్టిసు ప్రధానదుఃఖితాత్ముఁడుగ హ్యాంలెటుకనుగొనెను. అందులో లెర్టిసును జూడుము. నవనవలాడు యౌవనము, శకాత్ముఁడగు పురోహితునితో నేమిరో ననుచున్నాఁడు. ఇఁక నేమియును జేయుటకు వలనుపడదు, అనిపురోహితుఁడు. ఆ మెచావు స్వతస్సిద్ధమా ? లేక, ఆత్మహత్యయా! సంశయాస్పదముగనున్నది. గనుక మన మేమియు చేయఁగిట్టదు. తన

చెలియలు కర్మబాహ్యయగుటంజేసి లెర్టీసుకు ముక్కు మీఁదనే కోపమువచ్చినది. ఏదియోనొకటి తగులవెయ్యఁడి. మన్ను పారవేయుఁడి. సుభగగాత్రియగు, నిష్కటియగు నా మెహమాంసమునుండి వయొలెట్ (Violet పువ్వుల) మొక్కలు పుష్కలముగ మొలచునుగాక ! పురోహితునితో, 'నీవేమి యనుకొనుచుంటివో, నీకు రోగమాసన్నమయి, మూల్గుచుఁ బడియుండునప్పుడు, పరిశుద్ధాత్మురాలగు నా చెల్లెలొక దూతిక యయి, నీకు శాంతి గలిగించును. ఈమాటలు హ్యాంలెటువిని గుండెనిలిచినట్లయి, మొద్దువలె, నిలఁబడినాఁడు. వాని చెల్లెలా? కర్మబాహ్యయగు నీభూశయ్యాస్థాపనము, తనమనోరాణియగు, ఒఫీలియాకొఱకే గదా ! గెర్ట్రూడు రాణి, యేడ్చుచుఁ బువ్వుల నాసమాధిమీఁద వైచినది. మంచికి మంచి, అనినిట్టూర్పు. నీవు నాహ్యాంలెటుకు భార్యవగుదువని కలవరించితిని. నీపడకపాన్పును, గదిని నలంకరింతునని తలంచితిని. తానొకటితలంచిన, దైవము తలంచినది మఱియొకటి.

లెర్టీసుశోకము శ్రుతిమించినది. స్మృతినిఁగూడ మించినది. శాపనార్థములుపెట్ట నారంభించెను. వానిమొగము తగులవెయ్య, నీబుద్ధిని గంగలోఁగలిపినాఁడు. అని సురసుర పొక్కెను. తనయుఁగుంజెల్లెలును, యింకొకపరి కడసారపుఁ జూపును జూడఁగోరెను. ఇఁకనీయవతారము ముటుమాయమగును. మన్నుకప్పట, రొకింతతడవాపుఁడు. ఆగి వారివైపు చెయివిసరెను. ఒక్కసారి నన్నుఁగౌఁగిలింపనిండు. అని చెప్పుచు, ఖాళీసమాధిలోనికురికి, దుమికి, తనమీఁదఁగూడ మన్నుఁగప్పవలసినదని కోరెను. హ్యాంలెటుకూడ ముందుకు

వచ్చి దానిలోనికి దుమికెను. నేనెవరినో, నీకుఁ దెలియునా? నేను, నేను. హ్యాంలెటనువాఁడను, (డెన్మార్కుదేశస్థుఁడను) మతిపోయినట్లు చప్పట్లుచఱచెను. నేను, ఒఫీలియాను ప్రేమించియున్నాను. కామించియున్నాను. నాలుగుపదులవేల సోదరులయినను, వాండ్రకాపేక్షయుండిన నుండుఁగాక. నాకేమిక్కొదువ? నాయంతఃకరణమును మించలేదు. నాప్రేమ పసయుట్టిది. లెర్టిసునుఁగట్టిగఁ బట్టుకొని, విడిలించి, నీమొగముతగలెయ్య, అనెను. నిప్రార్థన చక్కనిదిగాదు. నాగొంతు మీఁదిచేతులు తీయుము. నన ఒఫీలియాయొక్క సోదరునకపాయముచేయుటకు సుతరాము హ్యాంలెటుకిష్టములేదు. అయినను, స్వరితతఁగార్థమెనుట నిలఁబడవలసి వచ్చినది. హోరేషియోయు నక్కడనుండువారును, వారిద్దఱిని విడిపించిరి. 'ఏమి కారణము? నన్నిటుచేసితివే? నిన్నెప్పుడును నేను ప్రేమించువాఁడనే! ఏమినాకర్మము!' అనిహ్యాంలెటు. కోపముతోనే, లెర్టిసునడిగెను. ఆవల్లకాటియందు తనను నాదరించువారెవరును లేరుగావున, హ్యాంలెటును, స్నేహితుఁడు హోరేషియోయును నక్కడనుండి వెడలిపోయిరి.

లెర్టిసుతోఁ గయ్యమునలుప నప్పుడు హ్యాంలెటుకుఁ దనకోపములు తనకుఁ దెలియనందులకు వాస్తవముగఁ గించపడెను. అతనికిని దనకును దుఃఖము సమానమేయునియు వెంటనే యతనిక్షమను వేఁడి మిత్రిభావము పూనవలెనని తలఁచెను. రాజుగారియెదుట లెర్టిసుతోఁ దానుస్నేహరీతిగఁ గత్తిసాముసకు దిగుదువా! అను వర్తమానము వచ్చినప్పుడు తనయొప్పుదల చెప్పిపంపెను.

ఇప్పుడుహ్యాంలెటుకుఁ బట్టినదయ్యము కొఱవిదయ్యా ము—దురాత్ముఁడుక్లాడియసును గాల్చికొని తినవలయును; తుత్తునుకలుగావించి, గాకులకును గ్రద్దలకును బలివేయవలయును ఇదియెటులనెఱవేఱును? అదియే నతనికగమ్యాగోచరము. కానియొక్కటిమాత్రము సునిశ్చితము గావించుకొనెను. క్లాడియసుతప్పక చావవలెను. అతిత్వరితముగఁ జావవలెను. తనచేతిమీఁదుగ, తనతల్లియగు రాణి, డెన్మార్కుసీమరాణి నడుమనున్నది, నడివెన్నుయే. ఆమెదే యున్నదిగాండీవము. ఆమెనుదలపూవాడక విడువవలయును. క్లాడియసుకూడ, హ్యాంలెటునదురించి, రాణిని మనుచవలయుననియే తలంచెను. హ్యాంలెటుకంటె నీయన మిగుల క్రియాశాలి. నిర్వాహణశీలి. హ్యాంలెటు మాటలపోగు మొగ్గలువిఱువని యూహాలతీగ. తనయనుకూలమున, క్లాడియసు, హ్యాంలెటుయొక్క మారణహోమముగావించెను. ఆయుధమునకువిషముపూఁత! ఇది తేలిపోయినపక్షమునఁ, బయోముఖవిషపూరితపాత్రమును సామీప్యముననుంచెను. కొడుకుగెల్పునకుబ్బి యిచ్చునట్లు, క్లాడియసుయే యిచ్చుటకు సంకల్పించుకొనెను; కల్పించుకొనెను. ఎవరికినేయనుమానము కలుగకుండునటుల, హ్యాంలెటు గెల్పునకు గొప్పపన్నిగము వైచెను. లెర్టిసు పేరుప్రతిష్ఠలు, ఫ్రాంసులోనుండియున్నప్పుడు, మిన్నుముట్టియున్నను, గాని కేమి? హా! రేపియోకమాత్రము కుత్సితపురాజువలన నాపరాయియ్యఁబడిన నీద్వంద్వయుద్ధము నచ్చలేదు. హ్యాంలెటుకుదానిమీఁద మతిపోలేదు. ఆయుధముమీఁదఁ జాకచక్యమున్నను, గుమారరాజా, యోడిపోవునని చెప్పెను, నేనట్లను

కొనను; లెర్టిసు. ఫ్రాంసునకు వెళ్లిన నాఁటినుండియును నేను
బహుసాధకము చేసితిని. తప్పక నేను గెల్తును. ఒక్క సంగతి
మాత్రమున్నది. కులాసా మాత్రము లేదు. అయిన మాత్రమేమి?
గెలుపోటములెట్లైనను తనకేమి? ఇక్కడ నేయుట్టిగట్టుకొని
యూఁగిసలాడవలయునని యనుకొనువాఁడా యేమి! ఆపైఁగా,

"నైనంఛిందంతి శస్త్రాణి, నైనందహతి పావకః ।
నచైనం క్లేదయంత్యాపో, నశోషయతి మారుతః॥"

మనకొక శ్రీకృష్ణభగవానుఁడు చెప్పినట్లే, ఆ డెన్మార్కు నిడు
పుగడ్డమీఁద, మాతృగర్భము సొచ్చి, మనినదమొదలుగఁ
దిన యాత్మారాముఁడు తనకురక్షరేకుగట్టియే యున్నాఁడు.
పన్నిసమునకొప్పుకొనిన బాదకము లేదు. అందువలన నొప్పు
కొనెను. కానిపక్షమున, లెర్టిసును నిరసనము చేసినట్లగపడు
ను. హారేషియోమాత్రము, హ్యాంలెటు తనకుఁగలదను
కొనిన నిపుణతను, సాధకమునకుఁ దెచ్చువిషయము తప్పిం
పఁజూచెను. తాను వెళ్లియిప్పుడు తగియుండలేదని చెప్పుదు
ననెను.

కాని హ్యాంలెటు వినువాఁడా? వినిపించుకొనువాఁడా?
తనయాలాపనయే తనది. నీజ్యోతిషము చాలును. శకునముల
కేమి? ఒకపిచ్చుకపాటునఁగూడ మాధవలీల ప్రత్యక్షము.
ఈశ్వరమాయ విస్పష్టము. శివునియాజ్ఞలేనిది, చీమ చిటుకు
మనదు. వృశ్చికము తనకొండెనెమీటదు. ఫణి తనకోఱల
విషము గ్రక్కదు. ఏదియును మనయత్నము లేదు. ఇప్పుడే
యగునని, మనమనుకొనునది కానేకాదు. కాదని మనమను
కొనునది పంతమునకగుతీరును. ఇప్పుడు కాదని మనమనుకొ

న్నను, యొప్పటికైనను, గాకమానదు. ఏదైననేమి? ఎటులనైన నేమి? మన కేమి? 'ఎప్పటికెయ్యది ప్రస్తుతమప్పటి కామాట'. నొప్పించక తానొవ్వక, తప్పించుక తిరుగుటధన్యత. ఏమైనుండ కేగొనుగో! తయారుగమాత్ర ముండవలయును. చెప్పులలోc గాళ్లు పెట్టుకొని, సాసిద్ధుండయి యుండవలెను. మానవుండు తనతోడ నేమియును వెంటంగొనండుగదా! అట్టిస్థితిలో, వెడలి పోవుట కేమిసంకోచము? కానిమ్ము.

చేతులకలయికకు పక్రమింపకమును, హ్యాంలెటు, లెర్టిసు వైపునకతిసరసతతో, కలుపుంగోలుతనముతోc గడచినదానికి సమాధానక్షమాపణతో, మీయెడ నపరాధము గావించితిని. మీయుదారస్వభావులగు గనుక నన్ను క్షమింపుడు. క్షమింపుడు. మతిస్థిమితము లేక నేనుపమురభసమును, కొట్లును మీరు విని యేయుందురు. లెర్టిసు, యొకానొకసమయమున హ్యాంలెటును భేమించియుండెను. మరియుమాయావి యగుక్లాడియసు, లెర్టిసుయొక్క మతివివిరిచినాండు. లేనియెడల, తనస్వభావము నకు విరుద్ధమగు, యీాజరుగనున్న కుటిలయత్నమునకుc జేపి యొగ్గియుండండు. కాంబట్టి, హ్యాంలెటు, అనినమాట కేదియో నొకజవాబిచ్చినట్టుగ మాట్లాడను. స్నేహసూచకములగు కరస్పర్శము లేమేనోసాంగించెను. హ్యాంలెటు తనకడుపులో నేమియును విషములేదు గావున, కపటము లేదుగావునc బన్ని దమునకు దిగెను. లెర్టిసు తనవిషముపూతయాయుధముc జేకొనెను. అడావిడిగ రాజుగారు 'సారాయిదొప్పలు తయారుగావింపుండు' అనిరి. హ్యాంలెటుగెల్చిన, ఫిరంగులుకాల్పుం డు. అరంభముకానిండు. మధ్యవర్తులారా! న్యాయమూర్తి

లారా! మీనూమృత్యువ్రష్టిని నిరీక్షింపుఁడు; వీక్షింపుఁడు; ఈక్షింపుఁడు. రాజుగారు చెప్పినప్రకారము మొదటిసారి లెర్టిషు, హ్యాంలెటును గెలువనిచ్చెను. ఫిరంగులు పేల్చిరి. రాజుగారడావిడి చేసిరి. మధుపూరితపాత్రల నెగరవైచిరి. హ్యాంలెటుకుఁగూడ నిచ్చిరికాని, నిరాకరించినాఁడు. 'ఆని నటుండనిండు. ఈయాట ముందు కానిండు' అనినాఁడు. తిరిగి నూటిపోటీయాట, ముదురుపాకముతో, క్లాడియసుకు భయము వేసినది. హ్యాంలెటుయే యుభయులలో నెక్కుడుసామరి; పనివాఁడు; అయుధప్రవిమప్రమైనను హ్యాంలెటు దేహము మీఁద గీకుటకుఁగూడ తగినయవకాశము చిక్కించుకొనలేదు. పైఁగా, ఈకాండవసారికూడ హ్యాంలెటుదియే మేలుచేయి యయినది. తండ్రియొకరీతిచూపు, తల్లియింకొకచూదిరి చూపులోను గనిపెట్టుచుండిరి. కొడుకు బహునిపుణతతో సాముచేయుచున్నను, మొగముకళ బహుళచంద్రునికళవలె తీసికట్టునకు వచ్చుచున్నట్లును, శ్వాసతగ్గ మీఁద యున్నట్లును మిగుల వేడియెక్కినట్లు, అతనితల్లికిఁ బొడఁగట్టినది. ఆమె కూడ నాగిన్నెను దవపెదవిడగ్గఱనుంచుకొని, కొమరునిఁ బిలిచి త్రాఁగనున్నది. గెర్ట్రూడ్! నీవుత్రాఁగవలదని మగఁడఱచి, కొన్ననామెమొగ్గనుండి లాగివేసెను. అప్పటికప్పుడే మిగిలిపోయినది. ప్రమాదమయినది. కొంపమునిఁగిపోవనున్నది. కాపురముకూలిపోవనున్నది. అవిషపాత్రనుండి యొకచుక్కయు నెంతుగుక్కను భ్రమింగినది. గుటుక్కున భ్రమింగినది. ఇఁక నేమియు నూ ప్రయోజనముండదని క్లాడియసుకు సంపూర్ణముగఁ దెలియును. హ్యాంలెటు కానిప్పుడు త్రాగలే

ననియును, నిధానింతుననియును జెప్పెను. తిరిగియాట మూడవ సారి ప్రారంభము. ఈసారి క్లాడియసు వైపునకుఁ దిరిగి లెర్టిసు తాను గెల్తునని చెప్పెను. అప్పటికే క్లాడియసు మొగమునఁ గత్తివాటు వేసిన నెత్తురు లేదు. వాలిన పాండిమ మొగముకళను విడిచి వేసినది. "నేనట్లు తలంచను" అనిమాత్ర మనెను. అన్నివైపులను, నాశనము, ప్రళయము, మూసికొని యాసన్నమగుచు వచ్చుచున్నది. ఆయుధముచేతఁ బూని, చంపుటకుఁ బ్రమాణముచేసిన హ్యామ్లెటు వైపునఁ జూడ్కి నిగిడించినను, తనమనస్సొప్పకున్నది. అనుమానించెను. త్వరలో సాంతముగా విడిచికొనవలయు నెఱుకొని, లెర్టిసు ! మూఁడవసారి త్వరితముగ రమ్ము. నీవూరక మొగతాళి చేయు చున్నావు. నీవు నీ విందు సామర్థ్యమును వినియోగింపుము, వినియోగింపుము; యోగించుకొనుము, వేగించుకొనుము, వేగ రించుకొనుము. అలాగునఁ జెప్పుచుంటివా ? అని యిఁకనట్లు విసువకుండునట్లు, నిశ్చయించుకొని—గతించిన తనతండ్రిని, చెలియలిని మనసున నెంచుకొఁ—"కాసుకొనుము" అనెను. ఈతడవవిషస్మరిత యాయుధము తళతళలాడినది. అను కొనినప్రకారము హ్యామ్లెటుకు మొనగీరినది. లెర్టిసును బడఁ గొట్టినాఁడు. ఈతందరలో తనయాయుధమును నేలఁబడవైచి నాఁడు. గుఱుతులేక హ్యామ్లెటు, లెర్టిసుయొక్క యాయుధ మును దనదియనుకొని కేలఁబూని, లెర్టిసు, కుక్క కాటునకు చెప్పుదెబ్బ, అనునట్లు గావించెను. దిక్కులగుఱ్ఱమునకు కక్కుల కళ్లెము దైవనిర్మాణము. ఇద్దఱును గ్రిందను, మీఁదను బడిరి. కోపావేశమునఁ గన్నుగానకయున్నారు. అనిక్లాడి

యను. హ్యాంలెటుమాత్రము, లెర్టిసును దిరిగిరమ్మనెను. ఆసమయమున లోలునవొకశబ్దము హ్యాంలెటుకు వినవచ్చినది. ఆతఁడాఁగిపోయినాఁడు. "రాణిగారివైపుచూడండి"అని రాజు గారు వడకుచు దిరిగిరి. అనుకొననియవస్థవచ్చినది. నురుగులు క్రక్కుచు, వెల్లకిలల పడినది. హ్యాంలెటుతల్లివైపునకుఁ బరు గిడి, అమ్మా! ఏమాగుచున్నది? అనెను. "నీకువచ్చునెత్తు టినుంచి యామెకుమూర్ఛవచ్చినది" అనితండ్రి. ప్రియా జోన్ముఖురాలగుతల్లి "కాదుకాదు" దాహము కొంపతీసినది. అయ్యో! హ్యాంలెటుకుమారా! నాకువిషము పెట్టినారు. అని తలవెనుకకు వ్రేలాడవైచినది. చనిపోయినది. ఎంత దురాగతము! అనికొనుచు. ఆఁ, ఆఁ, (విచారముచేతను, రౌద్రముచేతను, తన్నుఁదానిగానక) తలుపులు బిగించండి. తాళములు వేయండి. దుర్మార్గతచేసినారు. పట్టుకొండి, ఈగందరగోళములో, లెర్టిసు పడిపోయి, నేలమీఁదఁగూలి, హ్యాంలెటును దనయొద్దకుఁబిలిచి "నిన్నుఁజంపితిని. లోకములోని మందులుమూకులన్నియు, నీకు మేలు చేయలేవు. అరగంటసేపు కంటె నెక్కువకాలము నీకాయుర్దాయములేదు. ఆ మాయధారికటారి నీచేతిలోనేయున్నది. విషముపూయఁబడినది. నామీఁద కెదురుతిరిగినది. చూడుము. నేనుపడిపోయితిని. తిరిగి తలయెత్తను. నాపని యయిపోయినది. నీతల్లికి విషముపెట్టినారు. నేనింతకంటె నెక్కువచెప్పలేను—అంతకును, రాజు, రాజుయొదవకులమునకు మోసలము. మోసకుఁగూడ విషముఁబూఁతమా? అనిహ్యాంలెటు, అరచెను. విషమా! ఇఁక నీపని సాగించుకొనుము. తరువాయిపని. సాధించుకొనుము.

తన యసలుసంకల్పము నెఱవేఱునో లేదోయని క్లాడియస్సు, యూహించుచుండఁగఁ బూర్వమే, గెలిచిన రాణీముంగర, యేస్పులు పెదబొబ్బలు, అగుచునుండఁగనే, హ్యాంలెటుయమాకారము, అద్యోపయాంవతారముతోఁ గత్తినిదూసెను. తెప్పపాటు వ్యవధానము హాలాహలస్మేరితయగుకత్తి హంతకుఁడగుక్లాడి యసుమీఁద కసితీర్చుకొనినది. ఆస్థానసభికులెల్లరును, "రాజద్రోహము, రాజద్రోహము' అనిమొఱఁగిరి. నాకుఁగఁగుపాటి యపాయముకలిగినది. నన్నుఁగాపాడుఁడు. అనిక్లాడియసు మొఱ- హ్యాంలెటు, ఆవిషపూరితపాత్రను బుచ్చుకొని పానము గావించెను. ఈవిషయమునఁ నేవిధమగు ననుమానము లేదు. రాజుగారంతకన బెకలించి, యాగిన్నెలోని ద్రావమును లోనికి నెట్టెను. త్రాగుము. మాయమ్మను జేరు కొందువు. చనిపోకు, చనిపోకు. ఇదివిను. లెర్టిసుచెప్పినట్లుగ, నీకుశాస్తి బాగుగ జరగును. తానుతయారుగావించిన యాయుధముతననే యాహుతిగావించినది. లెర్టిసుయావత్తును గ్రహించి, హ్యాంలెటుతో "మనమొకరినొకరము క్షమించుకొనవలెను. దైవము మనలనిద్దఱ నిర్దోషులఁ జేయునుగాక ! అనిహ్యాంలెటు.

నేనును, నీవెంబడినె వచ్చుచున్నాను. తనగుండెకాయయగు హారేషియో వైపునకుఁదిరిగి కడసారపు శెలవు గైకొనెను. కడసారపుజూపులు నిగిడించెను. హారేషియోకు మాత్రము ప్రాణముమీఁదఁదీపి యుండునా ? కుమారమహీపతితోడ తానును బయనమైపోవలయునని యే యున్నది. నీవుబ్రదుకుము. బ్రదికియుండిన శుభములు. సుఖములుబడ

బుఱఁగలదుండుడుకు, కడుపుశోకము, గుండెదడయు నన్నియు
ను, సమసిపోయి, వీటియన్నిఁటిస్థానే యతినెమ్మదియును,
నిండుశాంతియును నెలకొనినవి. కలవుకలవు గైకొనుమీ!
కుమారరాజా! నీకఘవుచల్లఁగా ముక్కోటిదేవతలు నీకు
శాంతినొసంగుదురుగాక! నీకుస్థాయి నొసంగుదురుగాక!
స్థావరమునకు నిన్ను జేర్తురుగాక!

సంపూర్ణము.

త్రికాండములు సంపూర్ణము.



# జీవబ్రహ్మైక్య వేదాంతరహస్యము.

**అపూర్వగ్రంథము! కొన్ని ప్రతులుమాత్రమే ముద్రింపఁబడినవి! త్వరపడుఁడు!**

సత్యజ్ఞానానందంబులు కరతలామలకంబుగనుండు ఈ గ్రంథము శ్రీ పరమహంస సచ్చిదానంద యోగీశ్వరులవారిచే మొట్టమొదట ద్రవిడభాషయందు రచియింపఁబడినది. ఇప్పటి కది యెనిమిది కూర్పులవఱకు రమారమి పదునెనిమిది వేల ప్రతులు ముద్రింపఁబడి ప్రకటింపఁబడి యున్నది. ఈ గ్రంథముయొక్క ప్రాశస్త్యమును, ఘనతను దెలుపుటకుఁ బ్రస్తుతము దక్షిణదేశస్థులే సాక్షిగానున్నారు. భక్తాగ్రేసరులును, విద్యాభిమానులును, రాజకీయోద్యోగులును అగు కొందఱు అట్టి గ్రంథరత్నమును ఆంధ్రభాషలో రచియించిన తెనుఁగుదేశమునకు మహోపకార మని తలఁచి శ్రీ స్వాములవారినిఁ గోరినందున ఆగ్రంథము ఆంధ్రభాషకుఁ బైయోగీశ్వరులవారిచే భాషాంతరీకరింపఁబడినది. దీనిని వ్యయప్రయాసములకు వెనుదీయక కాపీరైట్ స్వాతంత్ర్యమును బొంది మాచేఁ బ్రకటింపఁబడినది. ద్రవిడదేశస్థులవలె తెలుఁగువారును దీనియం దధికాదరముఁ జూపుదురనినమ్ముచున్నాము.

ఇదివఱలో మనపూర్వు లతిగోప్యముగాను, రహస్యముగాను నుంచిన యనేక వేదరహస్యములు ఉపనిషద్భగవద్గీతల దృష్టాంతములతోఁ దేటతెల్లముగ బాలురును, బాలికలును తెలిసికొనునటులు ఈగ్రంథమున వ్రాయఁబడియున్నది.

కోఁతివలెనే పరిపరివిధములఁ బరుగులెత్తుచుండు మనస్సనెడు మర్కటమును ఎచ్చటకును బరుగెత్తకుండునటులు యజ్ఞోపవీతమను బ్రహ్మసూత్రము (నూలు) చే గట్టిగ బిగగట్టి నిలిపి, తన్నుఁ దా నెఱుఁగుటకు బహుసులభమయిన

మార్గము లీగ్రంథమున ఉపనిషత్తుల దృష్టాంతములతో నతి సులభముగా వ్రాయఁబడియున్నవి. మఱియు శ్వాస మనెడి వాయువులో మనస్సనెడి తలంపులు వందలకొలఁది జాగ్రదవ స్థయందును, స్వప్నావస్థయందును, బుట్టుచున్న వనియు,అట్టి మనస్సును నాశము చేయుపద్ధతియు, దేవతారాధన చేయు పద్ధతియు, సంధ్యావందనము చేయుసాధనము, అన్నమును మంత్రపూర్వకముగా శుద్ధిచేసి భోజనము చేయువిధము, సోహం మంత్రజపప్రభావము, శ్రీరామమంత్రము కర్మవాక్కునఁ గాని మనస్సునఁగాని ఉచ్చరింపకయు దలఁపకయు శ్వాసమ నెడి నూలుచే రామమంత్రమును బిగగట్టి జపముచేయుచు న్నప్పుడు తన్నుఁదాను మఱచి ఆనందపరవశుఁ డగుయుండు రహస్యమును; ఏకాంతస్థలమున, యోగాభ్యాసము (ప్రాణా యామము), నీళ్లు త్రాగి కాయశుద్ధి చేయుటయు, జీవులు చేయునట్టి పుణ్యాపాపకర్మముల కంతకు జీవుఁడు సాక్షియగు యుండి వారివారి పుణ్యాపాపములకుఁ దగినయట్లు సుఖదుఃఖ ముల ననుభవించుటకు పునర్జన్మము నిచ్చుచున్నాఁడని ఉప నిషద్భగవద్గీతాదృష్టాంతములతోఁ జెప్పి హృదయకమలమును రెండుచీలికలుగాఁ జీల్చి ఆత్మ జలమధ్యంబున నున్న దానిని జూపి, హృదయములోనే పంచభూతములు అణగియున్నవని ఆఱురంగులుగల పటముమూలమున తెలుపఁబడియున్నది. ఇట్టి దేవరహస్యము లన్నియు ఉపనిషత్తులలో నున్నను, ఇది వఱ కిట్టిగ్రంథము నెవరును ముద్రింపించి ప్రకటించియుండ లేదు. ఈగ్రంథకర్తగారు యోగియైనందువలననే సకల ప్రపంచము శ్వాసములోనే యణఁగియున్నదని స్వానుభవము వలన గ్రహించి అందులకు ఉపనిషత్తుల దృష్టాంతములను గూడ నిందు చెప్పియున్నారు.

ఈపుస్తకము రమారమి యెనిమిదివందలపుటలు గలిగి 24 పౌనుల గ్లేజుకాగితములమీఁద క్రౌనుసైజులో ముద్రింపఁ బడియున్నది. సందర్భానుసారముగా నక్కడక్కడ పూర్వ కవిప్రణీత గ్రంథములలోని పద్యములు చేర్పఁబడియున్నవి. యోగాభ్యాసము చేయువిధము ఇరువదిరెండు ఫోటోపటముల (Halftone blocks) మూలముగఁ దెలిపి వీటిని 50 పౌనుల మంచి నునుపుకాగితముల (Art paper) మీఁద ముద్రింపించి చేర్పఁబడియున్నవి.

గిల్టుఅక్షరములు వేసి కాలికోగుడ్డతో నిండుగా బైండుచేయఁబడి యున్నది. వెల మూఁడురూపాయిలు.

జీవబ్రహ్మైక్యవేదాంతరహస్యము 3—0—0

పూజాగృహమునకు కావలసిన మంచి సువా
సనగల ఊదు(అగరు)వత్తులు, ఇది 1¼గంట
సేపు వెలుగును. (వంద ఒకటికి) 100 కి 2—0—0

గంధకకల్పము ఒకమండలము(40 దినముల)
ఔషధము ... ... 10—0—0

ఇవిగాక యితరగ్రంథములు కావలసిన మాకువ్రాసిన యెడల పంపఁబడును.

తపాలు వి. పీ. ఖర్చులు మొదలగునవి కొనువారే భరిం పవలయును.

దొరకువారు:—ఆ. రాజగోపాలు అండు కో.,
168, స్ట్రాహన్సురోడ్డు, చూళపటాలము,
పెరంబూరు బారెక్సుపోస్టు, చెన్నపురి.

**Messrs. A. RAJAGOPAL & Co.**
**168, Strahans Road,**
**Perambur Barracks, Madras N.**

